తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

నవంబరు 2017, వెల రూ.5/-




తిరుచానూరు

## శ్రీ పద్మావతీఅమ్మవారి బ్రహ్మోత్సవాలు

2017 నవంబరు 15 నుండి 23 వరకు

# గీతాశ్లోకార్థసారం

**శ్లో : మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్ ।**
**కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥** (భగవద్గీత అధ్యా.10, శ్లో34)



**ప్రతిపదార్థం:** సర్వహరః=సమస్తమును సంహరించునట్టి; మృత్యుఃచ= మృత్యువును; భవిష్యతామ్= ఇకముందు ఉత్పత్తికాగల సమస్తము యొక్క; ఉద్భవఃచ= పుట్టుకయు; అహమ్= నేనే; (అస్మి= అయి ఉన్నాను); నారీణాం= స్త్రీలయొక్క (లేక స్త్రీలలో గల); కీర్తిః= కీర్తి; శ్రీః=సంపద(లక్ష్మి); వాక్ చ= వాక్కు (సరస్వతి); స్మృతిః= జ్ఞానము; మేధా=ధారణాశక్తి గల బుద్ధియు; ధృతిః=ధైర్యము; క్షమాచ= ఓర్పున్ను; (అహమేవ=నేనే; అస్మి=అయి ఉన్నాను).

**భావం:** సమస్తాన్ని సంహరించునట్టి మృత్యువును, ఇకముందు ఉత్పత్తి కాగల సమస్తముయొక్క పుట్టుకయు నేనే అయి ఉన్నాను. మరియు స్త్రీలలో గల కీర్తి, సంపద, వాక్కు, స్మృతిజ్ఞానము, ధారణాశక్తి గల బుద్ధి, ధైర్యము, ఓర్పు అను ఈ ఏడుగుణములున్ను నేనే అయి ఉన్నాను.

---

## శ్రీవేంకటేశునిల్లాలవై నీవు

జయలక్ష్మి వరలక్ష్మి సంగ్రామవీరలక్ష్మి
ప్రియురాలవై హరికిఁ బెరసితివమ్మా

పాలజలనిధిలోని పసనైన మీఁగడ
మేలిమితామరలోని మించువాసన
నీలవర్ణునురముపై నిండిననిధానమవై
యేలేవు లోకములు మమ్మేలవమ్మా

చందురు తోడఁబుట్టిన సంపదల మెఱుఁగవో
కందువ బ్రహ్మలఁగాచేకల్పవల్లివో
అందిన గోవిందునికి అండనే తోడునీడవై
వుందానవు మా ఇంటనే వుండవమ్మా

పదియారువన్నెలతో బంగారుపతిమ
చెదరని వేదముల చిగురుఁబోడి
యెదుట శ్రీవేంకటేశునిల్లాలవై నీవు
నిధుల నిలిచేతల్లి నీవారమమ్మా

(సంపుటం-02, సంకీర్తనం-288)



స్వామికి ప్రియురాలవైన నీవు అన్నింటా విజయాలనిచ్చే తల్లివి. కోరినవరాలను గుప్పించే తల్లివి. యుద్ధాలందు వీరత్వాన్ని ప్రసాదించే తల్లివీ ఐన నీవు తామరలను మించిన సుగంధపు వాసనలతో, వక్షఃస్థలంపై కాంతులీనుతున్న నీలమణితో ఒప్పారుతూ పాలసముద్రంలోంచి ఆవిర్భవించావు. అలా వచ్చిన నీవు అన్ని లోకాలను ఏలినట్టే మమ్ము కూడా చల్లగా చూడు తల్లీ!

చంద్రుని తోబుట్టువైన సంపదల తల్లివి. బ్రహ్మాదిదేవతలంతా కొలిచే కల్పవల్లివి. ఎల్లప్పుడూ గోవిందునిచెంతే తోడు నీడగా ఉండే నీవు మా ఇంట కూడా కొలువై ఉండు తల్లీ!

పదహారువన్నెలతో మెరుస్తున్న బంగారుబొమ్మవు! వేదములకే వేదరాశివి. శ్రీవేంకటేశునికి ఇల్లాలివి మాత్రమే కాదు, మేమంతా కూడా నీ దయాచూపులకు ఎదురు చూచే వారమే తల్లీ! అంటూ అన్నమయ్య అలమేలుమంగ దివ్యత్వాన్ని కీర్తించాడు.





## భక్తుల సేవలో...

# 'గోవింద తిరుమల తిరుపతి దేవస్థానమ్స్' యాప్




ప్రపంచవ్యాప్తంగా ఉన్న శ్రీవారి భక్తులకు మరింత చేరువయ్యేందుకు 'గోవింద తిరుమల తిరుపతి దేవస్థానమ్స్' యాప్ ప్రారంభం. ఈ యాప్‌ను మార్చి 29వ తేదీన ఉగాదిరోజున తి.తి.దే. కార్యనిర్వహణాధికారి ప్రారంభించారు. టి.సి.ఎస్. సహకారంతో రూపొందించిన ఈ మొబైల్ యాప్ ద్వారా భక్తులు వేగంగా, సులభంగా ఎక్కడి నుంచైనా సేవలను పొందవచ్చు.

ఇందులో ఈ-హుండీ, ఈ-డొనేషన్, రూ.300/- దర్శన టిక్కెట్ల బుకింగ్ సదుపాయాలు ఉన్నాయి. దశలవారీగా తి.తి.దే. సేవలన్నింటికీ ఈ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. తి.తి.దే. వెబ్‌సైట్‌కు 33 లక్షలమందికి పైగా యూజర్లు ఉన్నారు. కావున, వీరందరూ కూడా ఈ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

## మీ మాట

### చెప్పలేనంత సంతోషంగా...

'సప్తగిరి' మాసపత్రిక మా ఇంటిల్లిపాదినీ ఆధ్యాత్మికంగా ఎంతో ఆనందపరుస్తుంది. ఆగష్టు మాసపత్రికైతే 01వ తేదీ నాటికే మా గుమ్మం వద్దకు చేరుకుంది. సకాలంలో మాకు చేరినందుకు మాకు చెప్పలేనంత సంతోషంగా ఉంది.

*- టి.బ్రహ్మచారి, యాదాద్రిభువనగిరి.*

### ప్రాధాన్యం

వైభవోత్సవముల పావనమూర్తి చిత్రంతో వెలువడిన ఆగష్టు-2017 సప్తగిరి ఆధ్యాత్మిక మాసపత్రిక ద్వారా విశేష ఆధ్యాత్మిక విషయాలను సవివరంగా తెలుసుకున్నాం. ప్రతినెలా క్రింద ప్రచురిస్తున్న నీతివాక్యాలను మా పిల్లలకు చదివి చెప్తున్నాం. వరలక్ష్మీవ్రతం ఆవశ్యకత, శ్రీ వేంకటేశ్వర లీలలు, గోకులాష్టమి విశిష్టత ప్రాధాన్యత తెలుసుకున్నాం. పత్రిక సకాలంలో అందుతోంది. అభినందనలు.

*- గుగ్గిలం శ్రీహరి, వేటపాలెం.*

### విందు భోజనం

సెప్టెంబరు 'సప్తగిరి'లో ప్రతి శీర్షిక హైలైట్. చదువుతుంటే విందు భోజనం అందించినంత ఆనందం కల్గింది. పత్రిక అతి తక్కువ ధరలో అందరూ చదివేలా అందిస్తున్నందుకు కృతజ్ఞతలు.

*- పి.రవీందర్‌రెడ్డి, మహబూబ్‌నగర్.*

### ఎంతో ఉపయోగపడుతున్నాయి!

సప్తగిరి మాసపత్రిక ప్రతినెలా ఎన్నో ధార్మిక ఆధ్యాత్మిక, భక్తి విషయాలను వ్యాసాల రూపంలో అందిస్తున్నది. ఇవన్నీ కత్తరించి దాచుకునేటట్లుగా ఉంటున్నాయి. ఈ వ్యాసాలు పాఠశాలలో పిల్లలకు ధార్మిక విషయాలు బోధించడంలో ఎంతో ఉపయోగపడుతున్నాయి!

*- కె.రాధ, పుత్తూరు.*

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 48 నవంబరు, 2017 సంచిక : 06




వేంకటాద్రి సమం స్థానం
బ్రహ్మండే నాస్తి కించన।
వేంకటేశ సమో దేవో
న భూతో న భవిష్యతి ॥

## ఈ సంచికలో...



ముఖచిత్రం : శ్రీ పద్మావతీఅమ్మవారు, తిరుచానూరు
వెనుక చిత్రం : పంచమీతీర్థం, తిరుచానూరు


గౌరవ సంపాదకుడు
శ్రీ అనిల్‌కుమార్ సింఘాల్, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు
డా॥ కె.రాధారమణ, ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

సంపాదకుడు
డా॥ వి.జి.చొక్కలింగం, ఎం.ఏ., పిహెచ్.డి.,

ఉపసంపాదకురాలు
శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి, ఎం.ఏ., ఎం.ఇడి., ఎం.సి.జె., ఎల్.పి.టి.,

ముద్రాపకుడు
డా॥ టి. రవి, ఎం.ఏ., పిహెచ్.డి.,
పౌరసంబంధాధికారి, తి.తి.దే., తిరుపతి &
ఉపకార్యనిర్వహణాధికారి
(ప్రచురణలు & ముద్రణాలయం) ఎఫ్.ఏ.సి., తి.తి.దే., తిరుపతి

చిత్రకారుడు
శ్రీ పి.శివప్రసాద్, తి.తి.దే., తిరుపతి.

ఫోటోలు
శ్రీ పి.ఎన్.శేఖర్, ఫోటోగ్రాఫర్, తి.తి.దే.
శ్రీ బి.వెంకట్రమణ, సహాయఫోటోగ్రాఫర్, తి.తి.దే.,

సప్తగిరి మాస పత్రిక
ఇతర వివరాలకు
0877-2264543

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-




24 గంటలూ పనిచేసే తి.తి.దే. కాల్‌సెంటర్ ఫోన్ నెం.
0877 2277777 / 2233333



వెబ్‌సైట్- www.tirumala.org, www.tirupati.org; ఆన్‌లైన్ సేవలు/వసతిసౌకర్యం కొరకు- www.ttdsevaonline.com

సంపాదకీయం

# అదె చూడరే అభినవరూపం

*'అలమేలుమంగ నీ వభినవరూపము, జలజాక్షు కన్నులకు చవులిచ్చేవమ్మా'*– అంటూ పదవాగ్గేయ కారుడు అన్నమయ్య అలమేలుమంగ అభినవరూపాన్ని కన్నులకింపుగా వర్ణించాడు.

అత్యంత శుభావహమైనరోజు. కలియుగమానవుల అదృష్టం పండినరోజు. భక్తులకోరికలు తీరడానికి నాందియైన రోజు. అదే కార్తికమాసం, శుక్లపక్షం, పంచమీశుక్రవారం, ఉత్తరాషాఢనక్షత్రయుక్త విజయ లగ్నంలోనున్న దివ్యాతిదివ్యమైన రోజు. అత్యంత శుభప్రదమైనవేళ. అలాంటి కల్యాణప్రదమైనవేళలో పాతాళ లోకంనుండి శ్రీమహాలక్ష్మి శ్రీనివాసుడు తపస్సుచేస్తున్న పద్మసరోవరంలో అవతరించింది. శ్రీనివాసుడు నాటిన సహస్రదళపద్మం వింతవింతలుగా ప్రకాశిస్తూ వికసించింది. అద్భుతంగా వికసిస్తూ మనోహరమైన సువాసన లను నలుదిశలా విరజిమ్మింది. ఆ బంగారుపద్మనాళంద్వారా పద్మంలోని కర్ణికమధ్యలో శ్రీమహాలక్ష్మి ఆవిర్భ వించింది.

వజ్రవైడూర్య మరకతమాణిక్యాది సర్వాభరణాలతో, పూలమాలతో శ్రీమహాలక్ష్మి అవతరిస్తూండగా దేదీప్యమానమైన వెలుగులు అంతటా విరజిమ్మాయి. వేయివిధాలుగా, వేయివెలుగులతో ప్రకాశిస్తున్న స్వర్ణరథం ఆవిర్భవించింది. ఆ సువర్ణరథం మధ్యలో పద్మపీఠంపై ఆసీనురాలై శ్రీమహాలక్ష్మి ఆవిర్భవించింది. ఆ జగన్మాతయే సర్వజగాలకు ఏకైక మహారాజ్ఞి. ఆ జగన్మాతచేతుల్లో పద్మాలున్నాయి. మెడలో పద్మమాల ఉన్నది. ఆ పద్మసరోవరంమధ్య గజరాజులు సేవిస్తుండగా స్వర్ణకమలంలో శ్రీమహాలక్ష్మి అవతరించింది.

ఆ దివ్యముహూర్తంలో సువర్ణపద్మంలో అవతరించినందువల్ల పద్మాలయగా, పద్మాసనగా, పద్మ హస్తగా, పద్మావతిగా, అలమేలుమంగగా కీర్తించబడింది. ఇదంతా తిరుచానూరు పద్మసరోవరమాహాత్మ్యమే!

అలాంటి పద్మసరోవరంలో ఆవిర్భవించిన ఆ జగజ్జనని, లోకపావని, అఖిలాండనాయకికి అంగ రంగవైభవంగా, బ్రహ్మాండంగా బ్రహ్మోత్సవాల సమారంభానికి సమాయత్తమైంది తిరుమలతిరుపతిదేవస్థానం. ఎటుచూసినా రంగురంగుల విద్యుత్తోరణాలు, సుందర ఉద్యానవనాలు, ఫలపుష్పప్రదర్శనలువంటివన్నీ కూడా దేదీప్యమానంగా అలరించబోతున్నాయి. ఆ తల్లికి ప్రతిరోజు వివిధరకాలైన వాహనాలను సుందరంగా అలంకరించి, ఊరేగింపు జరుగుతుంది. అప్పుడు చూడాలి.. ఆమె రాజసం.... అది మాటల్లో వర్ణించలేం! అందరూ వచ్చి కళ్లారా చూసి తరించాల్సిందే!!

ఇక ఆలయంలోపల ఎన్నెన్నో సేవలు. శుక్రవారాభిషేకాలు, కుంకుమార్చనలులాంటివన్నీ కూడా జరుగుతాయి. బ్రహ్మోత్సవాల ఆఖరిరోజు పంచమీతీర్థంనాడు చక్రతీర్థస్నానం సమయానికి వచ్చే తీర్థప్రజను వర్ణించ తరం గానిది. ఆ రోజు తీర్థస్నానం చేస్తే పుణ్యఫలప్రాప్తి కల్గుతుందని భక్తుల విశ్వాసం. ఇక ఆ రోజు ఆ తల్లికి కట్టే బంగారుచీరను చూసినట్లైతే సాక్షాత్తు వైకుంఠమహాలక్ష్మియే ఇక్కడుందా అన్నట్లు కన్నులకు కన్పి స్తుంది. ఇన్ని మహత్తులున్న ఈ తిరుచానూరు అమ్మవారి బ్రహ్మోత్సవాలకు అందరూ తరలిరండి. అమ్మవారి అనుగ్రహానికి పాత్రులు కండి.

*అందరికీ ఆ జగజ్జనని కృపాకటాక్షాలు పుష్కలంగా కలగాలని 'సప్తగిరి' ప్రార్థిస్తోంది.*

*'బ్రహ్మోత్సవ పునర్దర్శన ప్రాప్తిరస్తు'*



పచ్చతోరణం

# ఆనందనిలయుణ్ణి అనుగ్రహించిన అలమేలుమంగ!

– శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

ఓ స్వామీ! వేంకటేశా! నీవుండేదేమో ఆ కొండకొనపై ఆనందనిలయంలోనా! నీ పట్టపురాణి అలమేలుమంగ ఉండే దేమో కొండ కింద తగ్గులో దూరంగా మంగపట్నంలోనా! ఇది విడ్డూరంగా ఉంది. మరీ విచిత్రంగాను ఉంది. లోకవిరుద్ధం గానూ ఉంది.

స్వామీ! ఏడుకొండలవాడా! అలా మేము ఇద్దరం దూర దూరంగా ఉంటే మీ కేమిటి? అనుకుంటున్నారేమో! లోకులు పలుకాకులు. వాళ్ళు మీ ఇద్దర్ని గురించి పలురకాలుగా గుస గుసలుగా చెప్పుకొనే మాటల్ని చెప్తా వినండి. ఐనా ఈ మాటల్ని మీరూ వినే ఉంటారు. ఎవరికీ తెలియదులే అనుకొంటూ విన నట్టు నటిస్తున్నారు. అంతే! వాటినన్నింటిని మీరే గాక, చుట్టు పక్కల వాండ్లు వినేట్లుగా గట్టిగానే చెబుతున్నా. వినండి. ఆ తర్వాతనే మీ సమాధానం చెప్పండి. సరేనా!

ఒకాయన ఎవరో **"నీ వుండే దా నింగిలోని కొండపైనా నీ సతి ఉండేదేమో ఈ నేలపైనా"** అని పాడితే, ఒక కవి, **"ఆనందనిలయవాసా! అలమేలుమంగకు అలుక రానీయకు..."** అని కవిత్వం చెప్పాడు. కవులు, గాయకులు వీళ్ల తీరు ఇలా ఉంటే, ఇంక జానపదుల రీతి మరోలా ఉంది. అదీ చెబుతా, చెవులారా వినండి మరి!

స్వామీ! శ్రీనివాసా! మీకిద్దరికీ లగ్నం అయిన తర్వాత సారెతో పాటు వస్తున్న అలమేలుమంగతో **సిగ్గూ బిడియంతో ఉన్న కొత్త పెండ్లికూతురు కదా! అన్న జాలీ దయ లేకుండా పెనిమిటి హోదాలో "అన్నీ తెచ్చావు. కాని కరివేపాకు మరచి పోయావే! ఎందుకు తేలేదు?"** అని దెప్పిపొడిచావంట కదా! దాంతో ఆమె, తాను తెస్తున్న **"సారెపెట్టెలను"** ఏడుకొండల్లోనే అలాగే వదలిపెట్టి, వాటికి హనుమంతుణ్ణి కాపలా ఉంచి, ఏడుకొండల్లో కోనల్లో **"కరివేపాకు కోసం"** తెగ వెదికిందంట కదా స్వామీ! కరివేపాకుచెట్టే కనపడక, నీ కోపాన్ని భరించలేక అలమేలుమంగమ్మ అలిగిపోయిందంట కదా స్వామీ! అందుకే ఏడుకొండల్లో ఒక్క కరివేపాకుచెట్టు కూడా కనపడదంట కదా! ఇది నిజమేనా!!

ఇంకోమాట! పల్లెజనం మీ ఇద్దరి సరస సల్లాపాల మూటను విప్పి చెబుతున్న మాటలు. ఏంటంటే!

**ఆమె అలుకతో మూతి ముడుచుకొని ఆ మూలలో ఉంటుండగా, గుట్టుచప్పుడుకాకుండా, ఎవరూ చూడకుండా ప్రతిరోజు అర్ధరాత్రివేళలో ఏడుకొండలు దిగి "అలిపిరి"లో పావుకోళ్ళు బంగారువో, వెండివో, ఇత్తడివో, చెక్కవో, కనీసం తోలువో ఐనా కాళ్ళకు తొడుక్కొని మంగపట్నానికి నడచిపోతా వంట! అక్కడ ఆమెను గడ్డం పట్టుకొని మరి మరీ! బతిమలాడి ఓదార్చి తెల్లవారేలోగా, మళ్లీ కొండకు చేరతావంట కదా! అందుకే అలిపిరిలోని పావుకోళ్లన్నీ, తెగ అరిగిపోతాయంటనే! ఇదీ నిజమే!!**

కాని, ఒక్కమాట! మీ ఇద్దరికీ కలిపి చెప్తున్న మాట?

ఓ ఆనందనిలయవాసా! ఓ అలమేలుమంగమ్మతల్లీ! మీ ఇద్దరు ఒకరిమీద మరొకరు కోపగించుకున్నా, అలిగినా ఫరవా లేదు. అమాయకభక్తులమైన మామీద మాత్రం అలుగకండేం! నిండుగా దయ చూపించండేం!

ఓ పరంధామా! ఆనందనిలయవాసా! ఇప్పుడు నేను జెప్పిన ఊసులన్నీ విన్నావు కదా! దానికి జవాబు జెప్పుమరి! ఊఁ కానీ! ఆలస్యం ఎందుకు? చెప్పు స్వామీ!

చెప్పమంటావా! సరే వినండి మరి!

భక్తజనం ప్రేమగా గోముగా ఏదేదో ఆనందంగా అల్లుకొని చెప్పుకొంటుంటారు. ఆనందమైన అలాంటి కథల్లో కొంత నిజం లేకపోలేదు.

అదేంటంటే శ్రీమహాలక్ష్మి అయిన అలమేలుమంగ ఒక చోట అలిగింది; ఇంకొకచోట అనుగ్రహించింది.

అంటే శ్రీవైకుంఠంలో అలిగింది. భూలోక వైకుంఠమైన వేంకటాచల సానువులలో అనుగ్రహించింది.

ఆమె అలుకలో ఒక పరమార్థం ఉంది. ఆమె అనుగ్రహంలో ఇంకో పరమార్థం ఉంది. ఆమె అలుకా, అనుగ్రహం రెండూ జగత్కల్యాణకారకాలే! లోకక్షేమకారకాలే!

## శ్రీవైకుంఠంలో అలిగింది

పూర్వం ఒకప్పుడు ముందుచూపు ఉన్న తపస్సంపన్నులైన పరమయోగులు కలియుగమానవుల క్షేమంకోసం ఒక యాగం తలపెట్టారు. సరిగ్గా ఆ సమయానికే నారదమహర్షి అక్కడికి వచ్చి మీ మీ సంకల్పాలను, అభీష్టాలను నెరవేర్చే పరదైవం ఎవరో తేల్చుకొని యాగం చెయ్యండంటూ వెళ్లిపోయాడు.

ఆ పని కోసం అందరూ భృగుమహర్షిని నియోగించారు. ఆ ముని ముల్లోకాలు తిరిగి, రజోగుణంతో ఉన్నాడని బ్రహ్మదేవుణ్ణీ, తామసగుణంతో పరమకోపిష్టిగా ఉన్నాడని పరమేశ్వరుణ్ణీ, అందరూమెచ్చే దేవుళ్లుకారంటూ ఆవేశంతో తేల్చేసి, చివరకు శ్రీవైకుంఠంలో దూకుడుగా అడుగుపెట్టాడు. నేనూ శ్రీమహాలక్ష్మి ఆనందంగా ఆదమరిచి అతని రాకను గమనించక ఉన్న ఆ క్షణంలో సహించలేని భృగువు నా ఎదపై తన్నాడు. మహర్షి కదా! ఏదో ఆవేశంలో తప్పు చేశాడు. అతను చేసింది తప్పే! కాని జరిగిపోయింది కదా! అని క్షమించాను. పాపం పశ్చాత్తాపంతో బాధపడుతూ "స్వామీ!" కలియుగంలో "అందరి దేవుడివి" నీవే అంటూ వెళ్ళిపోయాడు.







ఆ ఋషి చేసిన నిర్వాకంవల్ల శ్రీమహాలక్ష్మి అలిగింది. నన్నూ, వైకుంఠాన్నీ విడిచిపెట్టి భూలోకం చేరింది. ఆమెను వెదుకుతూ నేను మహాలక్ష్మి లేని వైకుంఠంమీది విరక్తితో భూలోకం చేరుకున్నాను. లక్ష్మికోసం చెట్టూ పుట్టా వెదుకుతూ చివరకు ఆదివరాహక్షేత్రం చేరుకున్నాను. అప్పటికే అక్కడ శ్రీభూవరహస్వామి నాకు తలదాచుకోవడానికి స్థలమిచ్చాడు. అక్కడ ఉండగానే నాకు ఆకాశరాజు కూతురు పద్మావతితో వివాహం అయ్యింది. కాని సిరి లేనివాణ్ణి కదా! ఎవరు లెక్క







చేస్తారు? అందువల్ల నా సిరులదేవి లక్ష్మి 'కొల్హాపురం'లో ఉందని తెలిసి అక్కడికి వెళ్లాను.

ఆమెను పిలుచుకొచ్చుకుంటే నా సంసారం అన్నివిధాల కుదుటపడుతుందని తలంచా. కాని ఆమె కనపడితేగా! ఆమెకోసం ఒకరోజు కాదు, రెండు రోజులు కాదు ఏకంగా పదేండ్లపాటు కొల్హాపురక్షేత్రంలో పడిగాపులు కాచాను. నిద్రాహారాలు మానాను. కాని నన్ను దయతలిస్తే కదా! ఇంకా ఇప్పటికి ఆమె అలుక తీరినట్లు లేదు. ఆగ్రహంతోనే ఉన్నట్లు ఉంది, అని బాధపడుతుండగా ఆకాశం నుంచి కొన్ని మాటలు నాకు విన్పడ్డాయి.

**అశరీరవాణి**

సిరిలేని ఓ శ్రీనివాసా! జాగ్రత్తగా ధ్యాస పెట్టి విను. ఇక్కడ నీకు శ్రీమహాలక్ష్మీదేవి దర్శనం లభించదు.

నీవు ఇక్కడినుంచి దక్షిణదిశగా వెళితే **కృష్ణవేణీ** అనే పుణ్యనది కనపడుతుంది. ఆ దివ్యనదికి దక్షిణంగా ఇరవైరెండు యోజనాలదూరంలో **'సువర్ణముఖరీ'** అనే పుణ్యనదీపరివాహక ప్రాంతంలో పరాశర శుకాదిమునులఆశ్రమాలు ఉన్నాయి.

ఆ ప్రదేశానికి వెళ్ళి కుంతాయుధంతో (బల్లెం) ఒక సరోవరాన్ని నిర్మించు. అందులో స్వర్గంనుంచి తెచ్చిన బంగారు పద్మాలను ప్రతిష్ఠించు. ఆ తర్వాత శ్రద్ధాభక్తులతో శ్రీమహాలక్ష్మిని గూర్చి తపమాచరించు. అక్కడ నీ కోరిక తప్పక సిద్ధిస్తుంది" అని.

ఆ మాటలప్రకారమే నేను శుకమహర్షి ఆశ్రమ ప్రాంతంలో **'పద్మసరస్సు'**ను ఏర్పాటు చేసికొని కొంతకాలం కేవలం క్షీరంతోను, మరికొంతకాలం ఉపవాసదీక్షతోను పండ్రెండేండ్లపాటు తపస్సు చేశాను.

**భూలోకవైకుంఠంలో అనుగ్రహించింది**

కఠోరమైన నా తపస్సుకు మెచ్చిన శ్రీమహాలక్ష్మి **"అలమేలుమంగ"** రూపంలో అనుగ్రహించింది. అలనాడు వైకుంఠం నుండి అలిగి వెళ్లిపోయిన లక్ష్మీదేవి కొన్నివేలసంవత్సరాల తర్వాత మళ్లీ ఈ **పద్మసరోవరంలో కార్తీకమాసం శుద్ధపంచమీ శుక్రవారం ఉత్తరాషాఢానక్షత్రంతో కూడిన అభిజిత్‌లగ్నంలో సహస్రదళాలు కలిగిన బంగారుపద్మం మధ్యలోని కర్ణికలో అవతరించింది. అనేక వేలకోట్ల సూర్యకాంతులతో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న నా పట్టపురాణి అపురూపసౌందర్యం వర్ణనాతీతం!**

సుందరసుకుమారరూపంతో, పున్నమిచంద్రునిలాంటి గుండ్రని ముఖారవిందంతో నిలువెల్ల బంగారుచీరపై జీరాడుతున్న నవరత్నాల దివ్యాభరణాలతో, వజ్రఖచితకిరీటంతో పైరెండు ఎర్రనిచేతుల్లో అంతకంటె ఎర్రవైన పద్మాలను ధరించి కింది కుడి, ఎడమ చేతులను, అభయ, వరదముద్రలతో చెరగని తరగని చిరుమందహాసంతో... ఇలా నిలువెత్తు ప్రకాశిస్తున్న దివ్యమంగళశరీరంతో బంగారుపద్మంలో ఆవిర్భవించింది. కొందరు దేవతలు ఆమె పద్మంలో అవతరించింది కనుక **"శ్రీపద్మావతి"** అని స్తుతించారు. **'అలర్‌మేల్‌మంగ' పుష్పంపైన దేదీప్యమానంగా వెలుగులీనుతున్న దివ్యవనిత కనుక 'అలర్మేల్ మంగ' అని మరికొందరు కీర్తించారు.**

ఆనందనిలయుణ్ణైన నాకుగాని, అలమేలుమంగగా అవతరించిన శ్రీమహాలక్ష్మికిగాని ఎవరెవరు ఏమేమి కీర్తిస్తు

న్నారో, ఎవరెవరు ఏమేమి కోరుతున్నారో మాకిద్దరికీ ఇసుమంతైనా ఆనలేదు. అంట లేదు.

ఇన్నాళ్లకు కాదు కాదు. ఇన్నివేలఏండ్లకు అలకమాని ఈ భూలోకవైకుంఠంలో **"అలమేలుమంగ"** అనీ **"పద్మావతి"** అన్న పేర్లతో చేరుకొన్న **శ్రీమహాలక్ష్మిని నేనూ, ఆమె నన్నూ పరస్పరం ఆలింగనం చేసుకొన్నాం. నా మెడలోని కలువపూల మాలను ఆమె మెడలో వేశాను. మధురాతి మధురమైన ఈ ఆనందమయ ఘట్టాన్ని కన్నులార్పకుండా చూస్తూ యక్ష, కిన్నర, కింపురుష, దేవ, దానవ, మానవులందరూ** మాపై పూలవానలు కురిపించారు. మంగళవాద్యాలను మోగించారు. నన్ను చేరుకొన్న జగన్మాత అలమేలుమంగను బ్రహ్మేంద్రాదిదేవతలు అనేక విధాలుగా స్తుతించారు.

నా అనుమతితో అలమేలుమంగ సమస్తలోకాలవాండ్లను నిండుగా అనుగ్రహిస్తూ "ఇప్పుడు మీరు ప్రార్థించిన ఈ స్తుతిని విన్నా, చదివినా మీ కోరికలు సిద్ధిస్తాయి. పోయిన సంపదలు సిద్ధించడమేగాక, ఉన్నతోన్నతస్థానాల్ని పొందుతారు" అంటూ వరాలు గుప్పించింది.

**"అలమేలుమంగ - వ్యూహలక్ష్మి"**

**పూర్వం శంఖణుడనే రాజాధిరాజు బికారి అయ్యి, "పద్మసరోవరం" పుణ్యజలాల్లో స్నానం చేసి, "అలమేలుమంగ"ను దర్శించాడు. పిమ్మట తిరుమలకు వచ్చి శ్రీవారి వక్షఃస్థలంలోని 'వ్యూహలక్ష్మి'ని ఉపాసించి నిండుగా అనుగ్రహాన్ని పొందాడు. పోయిన సంపదల్ని, రాజ్యాన్ని తిరిగీ పొందాడు.**

## వ్యూహలక్ష్మి

ఆ తర్వాత నేను అలమేలుమంగను నా హృదయస్థానంలో **"వ్యూహలక్ష్మి"**గా ఆవాహనం చేసికొన్నాను. వెంటనే ఆమె **"ద్విభుజా వ్యూహలక్ష్మీ"** అన్నట్లుగా కేవలం రెండుచేతుల్లో రెండుపద్మాలను ధరించి, నన్ను ధ్యానిస్తూ పద్మాసనస్థ అయి నా హృదయపీఠాన్ని అలంకరించింది. అలా **"వ్యూహలక్ష్మి"**తో నేను నా నివాసస్థానమైన ఆనందనిలయానికి పయనమయ్యాను.

## స్వతంత్ర వీరలక్ష్మి

అంతలో "స్వామీ! ఆనందనిలయవాసా! ఈ రోజు శ్రీమహాలక్ష్మి, మీరు ప్రతిష్ఠించిన ఈ **పద్మసరోవరంలో "అలమేలుమంగ"**గా, **"పద్మావతి"**గా సువర్ణపద్మంలో ఆవిర్భవించింది. అందుకు గుర్తుగా, భూలోకవాసులు తరించేందుకుగాను ఆ జగన్మాతను ఇక్కడ **"అర్చామూర్తి"**గా వెలయింపజేస్తే బాగుంటుంది అంటూ, బ్రహ్మాదిదేవతలు ప్రార్థించారు. నేనూ సరే నన్నాను. కాని నా హృదయదేవేరి అయిన **అలమేలుమంగ** ఇలా పలికింది.

**"స్వామీ! ఆనందనిలయంలో "వ్యూహలక్ష్మి"గా చేరుకొన్న నన్ను, అర్చామూర్తిగా మీ ఆజ్ఞమేరకు నిలిచివుంటాను. కాని,** వేంకటాచలక్షేత్రంలో మీకు బ్రహ్మోత్సవాలు జరుగుతున్నట్లుగానే నాకు స్వతంత్రంగా నేను అవతరించిన కార్తిక పంచమిరోజు "పంచమీతీర్థం" నాటికి సుసంపన్నం అయ్యేట్లుగా పదినాళ్లపాటు ఉత్సవాలు, ఊరేగింపులు నిర్వహించాలి. తద్వారా మీరు లేకుండానే ఇక్కడ నాకొక్కదానికే ఉత్సవాలు జగదీశ్వరి అయిన మహారాజ్ఞిలాగా నాకు జరగాలి. కనుక "విరహలక్ష్మి" అనీ, "వీరలక్ష్మి" అనీ "స్వతంత్రలక్ష్మి" అనీ ఇలాంటి పేర్లతో స్తుతింపబడుతూ అందరినీ అనుగ్రహిస్తాను. **ఇంకొక్కమాట. స్వామీ! భక్తుల కోరికలను, ప్రార్థనలను తమరికే విన్నవిస్తాను. కాస్త దయ చూపండి స్వామీ!" అంటూ అలమేలుమంగ ప్రార్థించింది. తథాస్తు అని నేనూ అంగీకరించాను.**

## 'శ్రీ' నివాసుడు

అలా శ్రీవైకుంఠంలో నాపై అలిగి వెళ్లినందువల్ల **"సిరిలేని శ్రీనివాసుడి"**గా అనేకవిధాలుగా అవస్థలు పడుతూ చివరకు ఈనాడు **"వక్షఃస్థలవ్యూహలక్ష్మి"**గా ఉన్న సిరులదేవి **"అలమేలుమంగ"** నిండు అనుగ్రహంవల్ల **"శ్రీనివాసుడు" అనే సార్థకనామధేయంతో ఆనందనిలయం చేరుకొన్నాను.**

ఇంకొక్క మాట. ఏమంటే-

**ఆనందనిలయంనుండి అలమేలుమంగకు సారె!**

ఆనాటినుంచి **"అలమేలుమంగ"** అవతరించిన **"పంచమితీర్థం"** జరిగే చక్రస్నానం అనే అవబృథఉత్సవం జరిగే సమ





## పద్మావతికి "పంచమితీర్థం సారె"

**నేటికీ తిరుచానూరు "పంచమితీర్థం" నాడు ఆనంద నిలయుని నుండి రెండుపట్టుచీరలు, రెండుపట్టు రవికగుడ్డలు, పచ్చి పసుపుచెట్లు, పసుపు, చందనం ముద్దలు, పూలమాలలు, తులసి మాలలతో పాటు రెండు బంగారునగలు వీటితో పాటు, పిండి వంటలైన ఒకపడి (51) పెద్ద లడ్డులు, ఒకపడి (51) వడలు, ఒకపడి (51) అప్పాలు, ఒకపడి (51) దోసెలు మున్నగువాటిని ఏనుగ అంబారీపైన సారెగ తీసుకొచ్చి అలమేలుమంగమ్మకు సంప్ర దాయంగా సమర్పింపబడుతున్నాయి.**



యానికి ఆనందనిలయుణ్ణైన నేను, తిరుమల నుండి **"చీర, సారె పసుపు, కుంకుమ, చందనం, పూలమాలలు ఇవన్నీ"** పంపుతున్నాను.

**పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టను**

ఇలా 'పంచమితీర్థం'నాడు సారె పంపిన తర్వాత పద్మ సరోవరంలో **"అలమేలుమంగ"**కు పసుపు, చందనం, తిరుమంజనం మున్నగు ద్రవ్యాలతో తిరుమంజనం జరిగి చక్ర స్నానం పూర్తైన తర్వాతే ఆనందనిలయంలో, నేను నైవేద్యం స్వీకరిస్తాను. ఆనాడు అంతవరకు పచ్చి మంచినీళ్లయినా ముట్టను.

ఇంతకుముందే అడిగావు కదా! ఏడుకొండలు దిగి అలిపిరినుంచి కాలినడకన అలమేలుమంగ దగ్గరికి వెళ్తావు కదా స్వామీ! అని. ముఖ్యంగా ఈ "పంచమీతీర్థం"నాడు ఆనంద నిలయంనుండి కాలినడకతోనే అలమేలుమంగకు సారె పంపుతున్నాను. (ఇలా నేటికీ మా ఆలయ అధికారులు కొనసాగిస్తూనే ఉన్నారు.)

ఆనాడు శ్రీమహాలక్ష్మి అలిగినందువల్ల శ్రీవైకుంఠం భూలోకానికి తరలివచ్చింది. ఆ శ్రీమహాలక్ష్మి **"అలమేలుమంగ"**గా పద్మసరోవరంలోను, **"వ్యూహలక్ష్మి"**గా నా హృదయంలో పదిలంగా ఆవిర్భవించినందువల్ల వేంకటాచల పర్వతసానువులన్నీ భూలోకవైకుంఠంగా స్థిరమై భాసిల్లుతూ ఉంది.

ఈ భూలోకవైకుంఠంలో నాతోపాటు, **'అలమేలుమంగ'**ను, నా వక్షఃస్థలంలోని **'వ్యూహలక్ష్మి'**ని ఎందరో సేవిస్తూ కాలాంతరంలో ఎందరెందరో తరించారు.

చివరగా ఒక్కమాట!

జగన్నాటకంలో భాగంగా మేమిద్దరం ఒకరికొకరం అలిగినా, అన్యోన్యంగా ఉన్నా, అనుగ్రహించినా ఇదంతా జగత్కల్యాణంకోసమే. లోకక్షేమంకోసమే. పరాకాష్ఠలో మేమిద్దరం అభిన్నులమే! ఒక్కరమే! ఇద్దరం ఏకమై, మమేకమై భాసిస్తుంటాం! అందువల్ల మీరందరూ మా ఇద్దర్నీ కలిపే అర్చించండి! ఆరాధించండి! నిండుగా అనుగ్రహం పొందండి! ఆనందించండి!

*ఓం శ్రియై నమః*





# అలమేలు మంగాలయ అభివృద్ధిలో మహంతులు

– కీ.శే. ఈతమాకుల గురవయ్య

తిరుచానూరులో ఒకే ప్రాకారంలో మూడు దేవాలయాలు వెలసి ఉన్నాయి. మొదటిది శ్రీబలరామ, శ్రీకృష్ణస్వామి గుడి. ఇది అత్యంత ప్రాచీనమైంది. రెండవది శ్రీపద్మావతిఅమ్మవారిగుడి. సుమారు 240 సం॥లకు పూర్వం ప్రతిష్ఠ గావింపబడిందిగా భావన. అలర్మేలుమంగతాయారుగ, శ్రీనివాసుని ఇల్లాలు పద్మావతిదేవిగ పేర్కొనబడింది. మూడవది శ్రీసుందరరాజస్వామిఆలయం. ఇది వందసంవత్సరాలక్రిందట మహంతులచే కట్టబడింది.

తిరుచానూరు అని పిలువబడుతోన్న ఈ ఊరిపేరు శ్రీశుకపురం. వేదవ్యాసుని కుమారుడు శుకమహర్షిపేరున పిలువబడుతోంది.

తిరుచానూరులోని పద్మావతిదేవిఅమ్మవారికి మహంతులు ఎనలేని సేవలు అందించారు. క్రీ.శ.1843నుండి క్రీ.శ. 1933వరకు తిరుమలతిరుపతిదేవాలయాల పరిపాలనాదక్షులుగ, విచారణకర్తలుగా ఉన్నారు. ఆరుతరాల మహంతులసేవల గురించి శాసనాలున్నాయి. వీరు పద్మావతిఅమ్మకు పూజలు, వైభవోపేతమైన సేవలు అందజేశారు. వాటిని గూర్చి తెలుసుకుందాం.

ప్రథమవిచారణకర్తగా ఆంగ్లేయులనుండి క్రీ.శ. 1843వసం॥లో ఆలయపరిపాలనను తీసుకొన్న సేవాదాసు దృష్టి అంతా కొండమీద ఆలయాభివృద్ధిమీదనే ఉండేది. తిరుమలలోని అనేకకట్టడాలను జీర్ణోద్ధరణ చేసినట్లే తిరుచానూరులో కూడా అమ్మవారిఆలయంలో ముఖమండపాన్ని నిర్మించడమే కాకుండా అమ్మవారిచేతులకు వెండికవచాలను తయారుచేయించాడు.

మహంతు ధర్మదాస్ విచారణకర్తగ, తిరుమలతిరుపతిలోని దేవస్థానంగుడులకు సేవలందిస్తూ, తిరుచానూరులోని శ్రీ పద్మావతిఅమ్మవారిగుడిపై ఎక్కువ శ్రద్ధను చూపెట్టారు.

చతురస్రాకారంలో అమ్మవారిగుడిని, కృష్ణస్వామిగుడిని చేరుస్తూ పెద్దప్రాకారాన్ని నిర్మించారు. కృష్ణస్వామిగుడికి ఎదురుగా మహాద్వారగోపురాన్ని నిర్మించాడు. ఈ గోపురాన్ని మహంతులు కట్టారనే నిదర్శనానికి ఆ గోపురపుగోడపై హాథీరాంజీ మరియు శ్రీ వేంకటేశ్వరస్వామి "దాయాలాట" శిల్ప ప్రదర్శనం మనకు కనిపిస్తుంది. తిరుచానూరులో చాలచిన్నదిగా ఉన్న పద్మావతిఅమ్మవారిగుడికి ముఖమంటపాన్ని గట్టించాడు. దేవాలయ విస్తీర్ణాన్ని పెంచాడు. ప్రతి శుక్రవారం తిరుచానూరులోని తిరువీథులగుండా అమ్మవారి తోటకు వెళ్ళటంకద్దు.

ఆ తోటలో ఒక విస్తీర్ణమైన మంటపాన్ని కట్టించాడు. తోటలోపల నైరుతిమూలన లోతైనబావిని త్రవ్వించాడు. చుట్టూ రాళ్ళతో రమణీయంగ, చూడముచ్చటగ జలక్రీడాసరోవరాన్ని కట్టించాడు. ఈ జలక్రీడసరోవరంలో అమ్మవారికి తిరుమంజనం చేయించేవారు.

పద్మావతిఅమ్మవారి గర్భగుడిలో జటాబంధనం జేసి పద్మావతిఅమ్మవారిని (మూలవర్లను) భూమిలో సుస్థిరంగ ఉండేట్లు ప్రతిష్ఠించాడు. పద్మావతిఅమ్మవారికి వెండివస్త్రకవచాలను తయారుచేయించాడు.

అమ్మవారికి వజ్రవైడూర్యాలు పొదిగిన బంగారు కిరీటాన్ని చేయించి, ఆ కిరీటంచుట్టూ చిన్న చిన్న బంగారు గంటలు పొదిగించాడు. అమ్మవారికి బంగారు హస్తకవచాలు, చేతికి బంగారుపద్మాలు చేయించాడు.





తిరుచానూరులోని తిరువీధుల్లో బ్రహ్మోత్సవాల్లో తిరగ డానికి కొయ్యతో మహారథాన్ని చేయించాడు (అప్పటివరకు శ్రీపద్మావతిఅమ్మవారికి మహారథం లేదు.).

శ్రీ పద్మావతిఅమ్మవారిగుడిలో ఆగ్నేయంలో వంట శాలను గట్టించాడు. సామగ్రిని ఉంచుకోవడానికి ఆ వంట శాలకు పడమరదిక్కుగా మంటపంతో పాటు గదులనుకూడా గట్టించాడు. పద్మావతిఅమ్మవారి దేవాలయానికి ముందర వాహనమంటపాన్ని గట్టించాడు. పద్మసరోవరం ముందర తూర్పుదిక్కున ఉన్న సూర్యనారాయణస్వామి దేవాలయాన్ని పున రుద్ధరించాడు.

శ్రీభగవాన్‌దాస్ తిరుమలతిరుపతిదేవస్థానవిచారణ కర్తయైన తర్వాత తిరుచానూరులో ఉన్న పద్మసరోవరంలో మధ్య నీరాళిమంటపాన్ని కట్టించాడు. నీరాళిమంటపం శిఖరంపై బంగారుమలాం వేసిన కలశాన్ని ప్రతిష్ఠించాడు. ఈ పద్మసరో వరంలో శ్రీపద్మావతిఅమ్మవారి తెప్పోత్సవాన్ని ప్రారంభింప జేశాడు.



తిరుపతి శ్రీ కోదండ రామస్వామికి అనేక బంగారు నగలను తయారుజేయించాడు. ఈ నగలను తిరుపతి, తిరుచా నూరు గుళ్లకు విశేషఉత్సవదినాల్లో వాడుకోవటానికి గూడ ఉత్తర్వులు జారీజేశాడు. వెండిరేకులు అతికించిన సూర్యప్రభ వాహనాన్ని, సర్వభూపాలవాహనాన్ని, తిరుపతి, తిరుచానూరు గుళ్ళలో వాడుకోవటానికి తయారుజేయించాడు.

ముఖమంటపానికి ముందున్న ధ్వజస్తంభానికి చుట్టూ పెద్ద ఎత్తైన రాతిమంటపాన్ని గట్టించాడు. ఈ కట్టడంతో శ్రీ పద్మావతిదేవాలయ విస్తీర్ణత మరింతగ పెరిగింది.

మహంతు ప్రయాగదాస్‌జీ తిరుచానూరులోని శ్రీపద్మా వతిఅమ్మవారిదేవాలయంలోని 1)శ్రీసుందరరాజస్వామికి, శ్రీదేవి, భూదేవేరులకు, 2)రుక్మిణీ సత్యభామాసమేత శ్రీకృష్ణస్వామికి, 3)శ్రీపద్మావతిఅమ్మవారికి–ఉత్సవర్లకు నిలిచిపోయిన తెప్పోత్స వాన్ని పునరుద్ధరించాడు.

తిరుచానూరులోని శ్రీ పద్మావతిదేవి అమ్మవారికి, మూలవర్లకు బంగారుకిరీటాన్ని చేయించాడు. అట్లే పద్మావతి దేవి ఉత్సవర్లకు కిరీటం, వస్త్రకవచాలు, నగలు, వజ్రాలు పొదిగిన కమ్మలు(చెవులకు) రెండుజతలు జేయించాడు. అమ్మ వారి దేవాలయంలో ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి లోహవిగ్రహం చెవులకు ఒకజత బంగారుకమ్మలు చేయించాడు.

శ్రీపద్మావతిఅమ్మవారి దేవాలయంలో ఉన్న ధ్వజ స్తంభం పాతబడిపోవడంతో, క్రొత్త ధ్వజస్తంభాన్ని జేయించి ఆ ధ్వజస్తంభానికి బంగారుపూత పూయించిన రాగిరేకులను జోడించి ధ్వజస్తంభాన్ని వేదోక్తంగ ప్రతిష్ఠించాడు. బంగారుధ్వజ స్తంభానికి ముందరున్న బలిపీఠానికి గూడ బంగారుకవచాలు తొడిగించాడు. పద్మావతిఅమ్మవారిదేవాలయప్రాకారం చుట్టూ లోపలా, బయటా 'గ్రానైట్‌స్టోన్స్'’ను పరిపించాడు.

ఇలా తిరుచానూరులోని దేవాలయాలకు హాథీ రాంజీ మఠం మహంతులు అనేకానేక ఉత్సవాలను, సేవలను జరిపించటమేగాక దేవాలయాభివృద్ధికి ఎంతగానో పాటుబడ్డారు. కాబట్టి మహంతులు తిరుమల తిరుపతి దేవస్థాన విచారణకర్తలుగా సదా చిరస్మరణీయులు.





కార్తికమాసానికి 'కౌముదిమాసం' అని మరో పేరు. 'కౌముది' అంటే 'వెన్నెల' అని అర్థం. 'న కార్తిక సమో మాసః' అన్న ప్రామాణిక వచనాన్ని బట్టి, కార్తికమాసంతో సమానమైన మాసం, వేదంతో సమాన మైన శాస్త్రం, గంగతో సమానమైనతీర్థం లేదంటోంది స్కాందపురాణం. కార్తికమాసంలో పౌర్ణమినాడు చంద్రుడు కృత్తికానక్షత్రంలో ఉండటంచేత ఈ మాసానికి కార్తికం అనే పేరొచ్చింది. అన్ని మాసాలకంటే కూడా కార్తికం ఎంతో పవిత్రమాసం అని శాస్త్రాలు చెప్తున్నాయి. అందుకే ఈ మాసంలో ముఖ్యంగా గ్రామీణప్రాంతాల్లో ప్రజలు తెల్లవారకముందే పుణ్య స్నానాలు చేసి ఆలయాలకెళ్లి దైవదర్శనం, దీపారాధన, కార్తిక పురాణ పఠనం, శ్రవణంలాంటివి చేస్తారు.

కార్తికమాసం శివకేశవులిరువురికీ ప్రీతికరం కావడం విశేషం. అందుకే ఈ కార్తిక ఆచరణలో శివకేశవుల అభేదము కనిపిస్తుంది. దేవతారాధనకు ఎంతగానో తగిన మాసం కార్తికం. ఈ నెలలో తుమ్మిపూలతో శివుణ్ణి, అవిసెపూలతో విష్ణువునూ పూజిస్తే విశేషఫలితాన్ని పొందవచ్చు.

కార్తికమాసంలో ఒక్కోరోజుకు ఒక్కో విశేషం ఉంది. ఈ నెలరోజులు పర్వదినాలే! దాదాపు ఈ నెలంతా పండుగే! ఈ కోవలో ముఖ్యమైన పండుగల గురించి తెలుసుకుందాం...

గృహలక్ష్మి

# శివకేశవులకు ప్రీతికరం

- శ్రీ కె.మల్లికార్జున

### క్షీరాబ్ధిద్వాదశి

కార్తికశుద్ధద్వాదశికి క్షీరాబ్ధిద్వాదశి అని పేరు. పూర్వం దేవతలు, రాక్షసులు అమృతంకోసం క్షీరసాగరమథనాన్ని ఈ రోజున ప్రారంభించారట. అందుకే దీనిని క్షీరాబ్ధిద్వాదశిగా పేర్కొంటారు. దీనికే మథనద్వాదశి అని మరో పేరు. మథన ద్వాదశిని తెలుగులో 'చిలుకుద్వాదశి' అంటారు.

ఎప్పుడూ పాలసముద్రంలో ఉండే శ్రీమహావిష్ణువు ఈ ద్వాదశిరోజున లక్ష్మీదేవి, బ్రహ్మాదిదేవతలందరితో కలిసి బృందావనంలోకి (తులసికోటలోకి) ప్రవేశిస్తాడు. అందుకే ఈ రోజున తులసిపూజ చేసే ఆచారం ఏర్పడింది.

ఈ రోజున పుణ్యస్త్రీలు తెల్లవారుజామునే లేచి తలంటి స్నానం చేస్తారు. సాయంకాలం తులసిపూజలయ్యేంతవరకు ఉపవాసం ఉంటారు. పూర్తి ఉపవాసం ఉండలేనివారు అల్పా హారాన్ని తీసుకోవచ్చు. తర్వాత సాయంకాలం తులసికోటను అలంకరించి విధివిధానంగా పూజిస్తారు. తులసికోటచుట్టూ దీపమాలికలు వెలిగిస్తారు. ఈ పూజ తర్వాత దీపదానం చేస్తే మంచిఫలితాలను పొందవచ్చు అని శాస్త్రవచనం. ఈ ద్వాదశి రోజున తులసిపూజ చేసిన వారింట్లో అకాలమృత్యువు రాదని పెద్దలమాట.

### వైకుంఠచతుర్దశి

కార్తికశుద్ధచతుర్దశియే వైకుంఠచతుర్దశిగా చెప్పబడింది. ఈ రోజున మహావిష్ణువు, పరమశివుణ్ణి పూజించడంచేత ఎంతో పవిత్రదినంగా పేర్కొనబడింది.

ఈ రోజున విష్ణువు వైకుంఠం నుండి కాశీక్షేత్రానికి వెళ్లి, విశ్వనాథుని అర్చిస్తాడట. ఈనాడు లింగవ్రతాన్ని ఆచరించాలని 'చతుర్వర్గచింతామణి' చెప్తోంది. ఈ రోజున ఇత్తడి లేదా రాగికుందులలో దీపాలను వెలిగించి వాటిని దానం చేస్తే విశేషఫలాలను పొందవచ్చు.





### కార్తికపూర్ణిమ - జ్వాలాతోరణం

పరమశివునకు ఎంతో ప్రీతికరమైనరోజు కార్తిక పూర్ణిమ. శివుడు త్రిపురాసురులను సంహరించింది ఈ పౌర్ణమి నాడే. అందుకే ఈ పౌర్ణమికి 'త్రిపురపూర్ణిమ' అని పేరు.



ఈ రోజు ఉదయంనుండి ఉపవాసం ఉండి ప్రదోషసమయంలో స్త్రీలు శివాలయాల్లో దీపాలను వెలిగించాలి. తర్వాత పురుషులు ఈ దీపాలను విధివిధానంగా ఆరాధించాలి. ఈ దీపారాధన ఉసిరికచెట్టుక్రింద చేస్తే విశేషఫలితాలను పొందవచ్చు.

ఈ కార్తికపూర్ణిమనాడు శివాలయాల్లో 'జ్వాలాతోరణోత్సవం' జరుపుతారు. త్రిపురాసురులను సంహరించిన తర్వాత పరమేశునికి దృష్టిదోషపరిహారంకోసం పార్వతీదేవి మొదటగా ఈ జ్వాలాతోరణోత్సవాన్ని జరిపించిందనీ, అప్పటినుండి అది ఆచారమైందని కథనం.

ఈ జ్వాలాతోరణోత్సవాన్ని దర్శించడంవల్ల సర్వ పాపాలు హరింపబడతాయని, ఆరోగ్యం చేకూరుతుందని, అపమృత్యువు నివారించబడుతుందని ప్రతీతి.

జ్వాలాతోరణోత్సవానికి నూలును ఉపయోగిస్తారు. ఈ నూలును పౌర్ణమిరోజు సంప్రదాయబద్ధంగా శివాలయంలోకి తీసుకొచ్చి, ఆలయప్రాంగణంలో శ్రీస్వామివారికి ప్రదక్షిణలు చేసి, జ్వాలాతోరణాన్ని శాస్త్రోక్తంగా పూర్తిగా నిర్వహిస్తారు.

### రమాఏకాదశి

కార్తికబహుళఏకాదశిని రమాఏకాదశి అంటారు. ఈ రోజున యథావిధిగా ఏకాదశివ్రతాన్ని ఆచరించి పెసరపిండితో చేసిన లడ్లు, బెల్లము దానం చేస్తే మంచి ఫలితముంటుంది.

### కార్తికబహుళద్వాదశి

ఈ రోజున గోపూజ చేయటం ఎంతో ప్రాశస్త్యం. మన భారతీయసంస్కృతిలో గోవుకు విశేషస్థానముంది. గోమాత సర్వదేవతలస్వరూపం. కార్తికబహుళద్వాదశినాడు దూడతో కూడిన గోవును పూజిస్తే ఎంతో పుణ్యం లభిస్తుంది.

### శనిత్రయోదశి

కార్తికబహుళత్రయోదశిరోజున శనిపూజవల్ల శుభ ఫలితాలను పొందవచ్చు. ఈ రోజున విధిగా శివాలయంలో రుద్రాభిషేకాలను చేయడంతోపాటు, శనీశ్వరుని పూజించడం వల్ల మంచి ఫలితాలు లభిస్తాయి.

ఈ రోజున నువ్వులు, నువ్వులనూనె, నల్లనివస్త్రం, ఇనుము దానం చేస్తే శనిదోషాలు తొలగిపోతాయి.

### యమతర్పణం

ఇది మగవాళ్లు మాత్రమే ఆచరించేది. కార్తికబహుళ చతుర్దశినాడు సాయంకాలం స్నానాదులను ముగించుకుని నువ్వులు, దర్భలు, నీళ్లు తీసుకుని దక్షిణంవైపుకు తిరిగి దర్భలు, నువ్వులు చేతిలో ఉంచుకొని యమాయనమః, ధర్మరాజాయ నమః, మృత్యవేనమః, అనంతాయనమః, వైవస్వతయేనమః, కాలాయనమః, సర్వభూతాక్షయాయనమః, ఔదుంబరాయనమః, దధ్నాయనమః, నీలాయనమః, పరిమేష్ఠినేనమః, వృకోదరాయ నమః, చిత్రాయనమః, చిత్రగుప్తాయనమః అంటూ ప్రతినామానికి నువ్వులు, నీళ్లు దేవతాతీర్థంగా అంటే ముందువేళ్లమీద నుంచి వదలాలి.

### మాసశివరాత్రి

పరమశివునికి ఎంతో ప్రీతికరంగా చెప్పబడే ఈ మాస శివరాత్రిరోజున సాయంసమయంలో శివుణ్ణి అభిషేకించి, బిల్వదళాలతో పూజించాలి.

పగలంతా ఉపవాసముండి, రాత్రి శివనామస్మరణతో జాగరణ చేయడం శ్రేయస్కరం. ఈ రోజు విధిగా శివాలయానికి వెళ్ళి దర్శించడం ఎంతో మంచిది. మాసశివరాత్రిరోజున శివాలయంలో దీపం వెలిగిస్తే విశేషఫలం లభిస్తుంది.

## కార్తికవ్రతాచరణ - నియమాలు

కార్తికస్నానం, ఉపవాసం, దీపారాధన, దీపదానం, దీపదర్శనం, సోమవారవ్రతం కార్తికమాసంలో ఆచరించాల్సిన ముఖ్యమైన నియమాలు.

### కార్తికస్నానం

కార్తికమాసంలో ఆచరించే పుణ్యస్నానాలను కార్తిక స్నానం అంటారు. కార్తికస్నానాలను ఆచరించడంవల్ల కాయిక, వాచిక, మానసికదోషాలు తొలగిపోతాయని పురాణాలు చెప్తున్నాయి. ఈ కార్తికస్నానం తెల్లవారుజామున చేయాలని శాస్త్ర వచనం. ఈ స్నానాలను వీలును బట్టి నదిలోనో, అది వీలు కానప్పుడు, పుణ్యనదులను స్మరించుకుంటూ చెరువులోనో, కాలువలోనో, బావులవద్దనో చేయాలి.



అనంతరం తుమ్మిపూలతో శివుణ్ణి, అవిసెపూలతో విష్ణువుని పూజిస్తే విశేషఫలితాలు లభిస్తాయి. ఈ పుణ్య స్నానాన్ని ఆచరించిన వెంటనే దగ్గరిలోని ఆలయాలను దర్శించి దీపారాధన, కార్తికపురాణపఠనంలాంటివి చేయాలి.

### ఉపవాసం

ఆధ్యాత్మికసాధనకు ఈ కార్తికమాసం ఎంతో అనుకూలం. అందుకే ఈ మాసంలో ఉపవాసం ప్రధాననియమంగా చెప్పబడింది. ఈ మాసమంతా పగలు ఉపవాసం ఉండి, రాత్రి భోజనం చేయడం మంచిది. ఉపవాసం చేయలేనివారు పాలు, పండ్లు, అల్పాహారంలాంటివి తీసుకోవచ్చు. కనీసం సోమవారాలు, ఏకాదశి, పౌర్ణమి, మాసశివరాత్రిపర్వదినాల్లో ఉపవాసం ఆచరించాలి.

### కార్తికదీపం

కార్తికమాసంలో దీపారాధనకు ఎంతో ప్రాముఖ్యముంది. కార్తికదీపాలను దేవాలయాల్లోనూ, మఠాలయందు, సూర్యోదయానికి ముందు సాయంసంధ్యాసమయంలోనూ వెలిగించాలి. అదేవిధంగా, ఇంటిముంగిట, తులసికోటవద్ద దీపాలను వెలిగించాలి. ఉసిరికచెట్టువద్ద దీపారాధన చాలా ముఖ్యం.

ఈ దీపారాధన ఆవునెయ్యితో చేయటం ఎంతో ముఖ్యం. ఈ దీపారాధనవల్ల కష్టాలు తొలగిపోతాయి. ఐశ్వర్యం లభిస్తుంది. పాపాలన్నీ తొలగిపోతాయి. ముఖ్యంగా స్త్రీలకు సౌభాగ్యకరం.

### ఆకాశదీపం

కార్తికశుద్ధపాడ్యమినుండి కార్తికమాసం పూర్తయ్యే వరకు ఆకాశదీపాన్ని వెలిగించాలని శాస్త్రం చెప్తోంది. ఈ మాసంలో దీపారాధనే కాకుండా దీపదర్శనం కూడా ఎంతో పుణ్యదాయకం. కార్తికదీపదర్శనంవల్ల జాతిభేదం లేకుండా మానవులందరికీ, ఇంకా పక్షులు, కీటకాలు, జలచరాలైన చేపలు మొదలైనవాటికి, వృక్షాలకు కూడా పునర్జన్మ ఉండదట.

### దీపదానం

ఈ కార్తికమాసంలో దీపదానం ఎంతో ఫలదాయకం. ఆవునెయ్యివత్తిని ఉసిరికాయమీద ఉంచి, వెలిగించి, తులసికోట వద్ద బ్రాహ్మణునికి దీపదానమిస్తే విశేషఫలం లభిస్తుంది.

### దానధర్మాలు

కార్తికమాసంలో చేసే దానధర్మాలు విశేషఫలితాల్నిస్తాయి. ఈ మాసంలో ఉసిరికచెట్టునీడలో విష్ణుస్వరూపుడైన దామోదరుణ్ణి అర్చించి సాలగ్రామాన్ని దానం చేయడం ఎంతో పుణ్యాన్ని కలిగిస్తుంది.

### సోమవారవ్రతం

కార్తిక సోమవారం పరమశివునికి ఎంతో ప్రీతికరం. ఈ రోజు పగలంతా ఉపవాసముండి సాయంకాలం శివుణ్ణి అభిషేకించి, బిల్వదళాలతో పూజించాలి. ఈ రోజు రాత్రి జాగరణ చేసి శివనామస్మరణతో కాలాన్ని గడపాలి. ఈ రోజు అన్నదానం చేయడం వ్రతనియమంగా చెప్పబడింది.





ఎప్పుడూ ఒకరికివ్వడం నేర్చుకో! తీసుకోవడం కాదు

### కార్తికమాసంలో నిషిద్ధవస్తువులు

కార్తికమాసంలో ఉల్లి, వెల్లుల్లి, గుమ్మడి, ఇంగువ, పప్పుదినుసులైన శెనగ, పెసర, అలసందలు తినకూడదు. ఈ మాసంలో ఈ వస్తువులను తింటే దారిద్ర్యం వస్తుంది.

### కార్తికమాస శివదీక్షాధారణ

కార్తికమాసాన్ని పురస్కరించుకుని శివమండలదీక్షను (41) ఆచరించే శివదీక్షాభక్తులు శుద్ధపాడ్యమిరోజున మండల దీక్షను స్వీకరిస్తారు. శివదీక్షను స్వీకరించే భక్తులంతా జ్యోతిర్లింగక్షేత్రమైన శ్రీశైలంలో శ్రీమల్లికార్జునస్వామివారిని స్మరించి, పూజించి దీక్ష విరమణ చేస్తారు.

### కార్తికపౌర్ణమికి తులసీపూజలు

కార్తికపౌర్ణమిని తులసీమాత జన్మదినంగా భావిస్తూ పండుగ చేసుకునే ఆచారం అనాదిగా వస్తూంది. శ్రీరామ నవమికి సీతారాములకల్యాణమహోత్సవాలు, సంక్రాంతి పండుగకు ముందు భోగిరోజున గోదాదేవికల్యాణం జరుపు తూన్నట్లుగానే తులసీనారాయణులకల్యాణాన్ని కూడా కార్తిక పౌర్ణమినాడు జరపడం చూస్తూంటాం.

ప్రతి సంవత్సరం మంగళవాద్యాలతో వైదికపద్ధతిలో తులసీనారాయణులకల్యాణాన్ని ఎవరైతే జరిపించి అన్నదానాలు చేస్తారో వారికి వైకుంఠప్రాప్తి కల్గుతుంది. తులసీనామాలను శాస్త్రీయంగా జపిస్తూ పూజించినవారికి అశ్వమేథయాగం చేసినంత ఫలితం కలుగుతుందని శాస్త్రాలు చెప్తున్నాయి.

సమస్తతీర్థాలూ, అన్ని పవిత్రనదులూ, అందరు దేవతలూ తులసీదళాల్లోనే ఉన్నట్లుగా పురాణాలు వివరిస్తు న్నాయి. తులసీదళాలను పూర్ణిమ, అమావాస్య, ద్వాదశి, సంక్రాంతిరోజుల్లోనూ, మిట్టమధ్యాహ్నం, రాత్రి, సంధ్యాకాలా ల్లోనూ, అపరిశుభ్రంగా ఉన్నప్పుడూ, రాత్రి అంతా ధరించిన వస్త్రాలతో ఉన్నప్పుడు త్రుంచకూడదు. అలా తులసీదళాలను త్రుంచినవారు సాక్షాత్తు శ్రీమన్నారాయణుని శిరస్సును త్రుంచిన వారౌతారు. ఆకులను మాత్రమే త్రుంచుకోవాలి. కొమ్మలను విరువకూడదు. అలా కొమ్మల్ని విరువడమంటే శ్రీమహావిష్ణువు హృదయాన్ని విరువడమే!

తులసీదళాలను కోసేటప్పుడు ఈ క్రిందివిధంగా తులసీమాతను ప్రార్థిస్తూ కోయాలి. 'ఓ మాతా! తులసీ! గోవిం దుని హృదయానందకారిణీ! నేను నారాయణుని పూజించ డానికిగాను నిన్ను త్రుంచుచున్నాను. నీవు లేకుండా ఏ విధంగా ఆయన్ని పూజించినా, ఆ పూజలన్నీ నిష్ఫలాలే ఔతున్నాయి. కనుక, శ్రీమహావిష్ణువును పూజించడానికి నీవు కావాలి. నన్ను కరుణించి ఆశీర్వదించు. ఓ తులసీమాతా! నీ నుండి దళములను త్రుంచడంద్వారా నీకు కలిగిస్తున్న బాధకుగాను నన్ను క్షమించు. నా నమస్సులను అందుకో' అని ప్రార్థించాలి.

గంగానదిలో స్నానం చేస్తే ఎంత ఫలితం కలుగు తుందో, నర్మదానదిని దర్శించుకుంటే ఎంత ఫలితం ప్రాప్తి స్తుందో అంతటి ఫలితం కేవలం తులసీసమూహాన్ని తాకడం వల్ల లభిస్తుందనీ, తులసితో పూజించినవారు తిరిగి జన్మించా ల్సిన దుర్గతినుండి తప్పించబడతారనీ, కార్తికమాసంలో తులసి మొక్కకు ఎవరు దీపారాధన చేస్తారో వారు విష్ణుసాయుజ్యాన్ని పొందుతారనీ, తులసిచెట్టు మొదట్లో ఉన్న తడిమట్టిని తిలకంగా ధరించినవారికి ఏ కీడూ కలగదనీ, మరణశయ్యపై నున్నవారి పైన తులసి మొదట్లో ఉన్న మృత్తికను చల్లితే వారికి మోక్షప్రాప్తీ కల్గుతాయి. తులసినీడలో జరుపబడిన శ్రాద్ధకర్మకు పితృదేవతలు ఆనందపరవశులౌతారు. తులసీపరిమళం సోకిన ప్రదేశమంతా పవిత్రతగా ఉంటుంది. కార్తికమాసంలో తులసిని పూజించినా, తాకినా కనీసం దర్శించుకున్నా చేసిన పాపాలన్నీ పటాపంచ లౌతాయనీ, తులసినీడలో ఆచరించిన ప్రతిపనీ పవిత్రతను




ఒక ఎదురుదెబ్బ తగిలినంతమాత్రాన వెనుకంజ వేయొద్దు

పొందుతుందనీ, శ్రీమహావిష్ణువును తులసీదళాలతో పూజిస్తే అంత్యకాలంలో వైకుంఠానికి వెళ్లే భాగ్యం కలుగుతుందనీ పద్మపురాణంలోని ఉత్తరకాండలో తెలియజేయబడింది.

తులసిని వినాయకుడిపూజలో మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ వినియోగించకూడదు. బ్రహ్మవైవర్తపురాణంలో విఘ్నేశ్వరుడు తులసీమాతను ఈ విధంగా ప్రార్థించాడు. "ఓ సౌందర్య రాశీ! తులసీ! పుష్పాల్లోకెల్లా నీవే గొప్పదానివి. నీవు నారాయణుడి ప్రియురాలివి. శ్రీకృష్ణుడు నిన్ను అమితంగా ప్రేమిస్తాడు. నీ పూజ తప్పకుండా మోక్షాన్ని ప్రసాదిస్తుంది. కానీ, నా పూజలో మాత్రం నిన్ను త్యజించవలసి ఉంటుంది" అని తరించాడు. కానీ, వినాయకచవితినాడు మాత్రం తులసితో గణపతిపూజ చెయ్యవచ్చు. శ్రీకృష్ణుడు ఒకసారి తులసిని పూజించి ప్రార్థించి, ఆమెను శరణు కోరినట్లు దేవీభాగవతం చెప్తున్నది.

తెలంగాణప్రాంతాల్లో ప్రతిరోజు ఉదయాన్నే స్నానానంతరం తులసిపూజలు చేస్తారు. కార్తికశుక్లద్వాదశినాడుగానీ, పూర్ణిమనాడుగానీ 'ధాత్రిలక్ష్మి', 'తులసిలగ్నం' అనేపేరున తులసి చెట్టుకు, ఉసిరికొమ్మకూ పెళ్లి చేస్తారు.

తులసికోటవద్ద 'నందాదీపం' వెలిగిస్తే శివకేశవులు సంతృప్తులై కైవల్యాన్ని ప్రసాదిస్తారు.

కార్తికశుద్ధద్వాదశినాడు తులసివ్రతమనే 'తులసమ్మ పండుగ'గా వేడుకలు చేసి, తులసీపూజానంతరం బాణాసంచా కాల్చటం కూడా జరుగుతుంది. ఈ వేడుకలు శ్రీకాకుళం, విజయనగరం, విశాఖజిల్లాల్లో, రాయలసీమప్రాంతంలో అనంతపురం, చిత్తూరుజిల్లాలోనూ జరుగుతాయి.

### కార్తిక వనభోజనోత్సవం

కార్తికమాసం శివకేశవులిద్దరికీ ప్రీతిపాత్రమైన మాసం. శరదృతువూ, వసంతఋతువూ యమదంష్ట్రికాకాలాలని జ్యోతిశ్శాస్త్రం చెప్తోంది. అందుకని వసంతఋతువులో శ్రీరామనవరాత్రులూ, శరదృతువులో దేవీనవరాత్రులు, కార్తికమాసంలో హరిహరారాధన భక్తిశ్రద్ధలతో చేయటంవల్ల అపమృత్యుభయం, ఆపదలు తొలగి మానవులు సుఖసంతోషాలతో వర్ధిల్లుతారు.

కృత్తికానక్షత్రంలో పూర్ణిమనాడు చంద్రుడుండే మాసం కార్తికమాసం. ఈ మాసంలో శ్రీమహావిష్ణువు యోగనిద్రనుండి మేల్కొంటాడు. ఈ కార్తికమాసం దీపాలపండుగ. వర్షఋతువులో బాగా వానలుపడి నదులూ, చెరువులూ, సరస్సులూ పుష్కలంగా నీటితో నిండి ఉంటాయి. ఆ ఆనందకాలంలో సర్వాపన్నివారణ కోసం ఆలయాల్లో పూజలు నిర్వహిస్తారు. ఈ కార్తికమాసంలో పున్నమినాడుకానీ, ఏదో ఒక సోమవారంనాడుకానీ వనభోజనోత్సవం జరుపుకుంటాం. అందులో భాగంగా ఆయాప్రాంతాల్లో దేవతాఉత్సవమూర్తులకు తెప్పోత్సవం చేయడం చాలాప్రాంతాల్లో సంప్రదాయం. ముఖ్యంగా మన ప్రాంతాల్లో ఇది ఎక్కువ.

వనభోజనోత్సవం సామాజికపరమైనది. ఈ ఉత్సవాన్ని క్రీ.శ.1537లో తాళ్లపాక పెదతిరుమలాచార్యులవారు తిరుమలలో ఏర్పాటు చేశారు. కార్తికమాసంలో శ్రవణానక్షత్రం ఉన్నరోజున ఈ వనభోజనోత్సవాన్ని జరుపుకుంటారు. అంతేకాకుండా శ్రీవేంకటేశ్వరస్వామి అవతరణ నక్షత్రం కూడా శ్రవణా నక్షత్రం. కాబట్టి సమాజంలోని అందరితో కలిసి, స్వామివారిని తోటలోనికి తీసుకెళ్లి, అక్కడ వంటలు చేసి, స్వామివారికి నివేదించి, పాటలు పాడి, అక్కడే అందరూ పంక్తి భోజనాలు చేసి, స్వామివారివెంట తిరిగి రావడంతో ఈ ఉత్సవం పూర్తౌతుంది. ఇల్లూ వాకిలి, హోదా అన్నింటినీ విడిచి వనానికి రాగానే మనకు ఎంతో ప్రశాంతత కలుగుతుంది. అలాంటి ప్రశాంతమైన జీవితం అలసిసొలసినవేళ పొందాలంటే దానికి పూర్వరంగమే ఈ వనభోజనం. ఈ సంప్రదాయాన్ని ఈ రోజు వరకు కూడా కార్తికవనభోజనోత్సవంగా జరుపుకొనటం తిరుమలలో సంప్రదాయం.



ఇలా కార్తికవనభోజనోత్సవం ఎంతో సామాజిక స్ఫూర్తినీ, భక్తివిశిష్టతనూ, ఐకమత్యాన్నీ, సమతాబుద్ధినీ పోషించే మహత్తరకార్యక్రమం. ఈ సంప్రదాయం ఇతర క్షేత్రాలకు ఆదర్శం, ఆచరణీయం కాగలదని ఆశిస్తూ, కార్తిక దామోదరుడైన శ్రీనివాసుడు అందరికీ సకలశుభాలను అనుగ్రహించాలనీ ప్రార్థిద్దాం.







ఒక సమర్థుడి వెనుక చాలామంది సమర్థత దాగి ఉంటుంది

*(గతసంచిక తరువాయిభాగం...)*

'నాకు కాబోయే వరుడు వైష్ణవుడుగా ఉండాలి. శంఖచక్రచిహ్నాలు ధరించిన వాడై ఉండాలి. అంతేకాదు ప్రసన్న చిత్తంతో రోజూ వేయిమంది వైష్ణవులను ఇష్టాన్నాలతో సంతృప్తిపరచాలి. ఈ షరతు లకు ఒప్పుకొన్నవారినే వరిస్తాను' అంది.

'మహారాజా! అన్నీ స్పష్టంగా చెప్పాం. ఈ నియమాలకు లోబడితే అడ్డంకులు ఉండవు' అన్నాడు.

'ఆలాగా! నేను వైష్ణవుణ్ణే. నాకు లోగడ 'తప్తముద్రాంకితం' జరిగింది. వైష్ణవులు ఆరగించాకగాని నేనూ భోజనం చేయ నులే' అన్నాడు.

షరతులు కుదరడంతో సమస్యలు పరిష్కారమయ్యాయి.

రుక్మిణి శ్రీకృష్ణుని వరించినట్లు కుముదవల్లి పరాంతకుని వరించింది. పర కాలుడు తనతో కుముదవల్లిని వెంట బెట్టుకొని తన పట్టణానికి వెళ్ళాడు. షర తులమేరకు ప్రతిరోజూ వెయ్యిమంది వైష్ణవులకు షడ్రసోపేతభోజనం పెట్టించి తదనంతరం తాను భోంచేసేవాడు. అంతే గాదు వైష్ణవులు ఎవరైనగాని ఏది అడిగినా ఇచ్చేవాడు.

ఈ కార్యక్రమాలతో పరకాలుడు తాను మంత్రినని మరచాడు. తాను చోళాధీ శ్వరుని బంటు అని కూడా గుర్తుకు తెచ్చుకోలేదు. 'ఎవరు ఎక్కడ పోయినా నాలాగే వైష్ణవులసేవ చేయగలిగితే చాలు. నేను భయపడను. దేవతలు అడ్డువచ్చినా సరి. జగత్తుకు 'వనమాలి' నాయకుడు. అతని దాసవర్గమంతా ఆయన సొమ్ము. వారిసొమ్ము వారు తింటున్నారు.' అనే భావంతో సమర్థించుకొనేవాడు.

పరాంతకుడి మాటలు, చేతలు అన్నీ చోళరాజేంద్రుడు గూఢచారులద్వారా తెలుసుకున్నాడు. తనే సామంతుల్ని రప్పించాడు. వారితో–

'మన్నీడులారా! వినండి. నేను ఎంతో విశ్వాసంతో రాజ్యభారం, కోశాగార భారం అన్నీ పరాంతకునిమీద పెట్టాను. అయినా అవన్నీ తనదైనట్లు దాసర్లపాలు చేయడం మీరు విని ఉండవచ్చు. ప్రధాన బొక్కసానికి ఒక్క కాసుకూడా ఎన్నాళ్ళ నుండో చెల్లించలేదు' అంటూ కరణాలను పిలువనంపాడు. వారు వచ్చి చేతులు జోడించుకొని నిలబడ్డారు.

'కరణీకులార! పరకాలుడు పాలించే సీమ ఎంత? మా ఉత్తర్వులమేరకు ఖజానాకు అతడు చెల్లించిన డబ్బెంత? చెల్లించవలసిన దెంత? మీరు దాచకుండా భయపడకుండా ఉన్నది ఉన్నట్లు చెప్పండి. మీలో ఎవరయినా అతని లంచాలకు ఆశ పడి వంచనతో విశ్వాసం మరచి అబద్ధాలాడితే మీ ఆట కట్టిస్తాను' అని గట్టిగా అద లించాడు.

'స్వామీ! మీరు అతనిమీద భరోసాతో వాకబు చేయకపోవడంవల్ల ఈ అనర్థం దాపురించింది. మీరే చెప్పమంటున్నారు గనుక నిమిషంలో అంతా తప్పక చెబుతాం. మీ పాదమాన! ఇంతకాలం అతణ్ణి చూచి భయపడ్డట్టు మేము ఇంక భయపడం. రాజ్యభారమంతా తాను మోస్తూ రెండవస్వామిలాగా ప్రవర్తించడంవల్ల అతడు పెట్టే ఖర్చుల వివరాలు దాచాం. మీ ఆజ్ఞప్రకారం ఇప్పుడు అన్నీ స్పష్టం చేస్తాం. మీ సమ్మతితో తన సీమ తాకట్టుపెట్టిననాటినుండి ఒక్కకాసు కూడా మనకు చెల్లించలేదు.



వేరే మాటలెందుకు?' అని విన్నవించగా రాజు ఆగ్రహోద గ్రుడయ్యాడు.

కాలకింకరభయకింకరులను రప్పించాడు.

'కింకరులార! మీరు వెంటనే వెళ్ళండి. పరకాలుడనే దొంగదగ్గరికి వెళ్ళి ఒంటికాలిమీదనిలబడి మనకు రావలసిన డబ్బు గుంజి పట్టుకురండి. కుదరకపోతే వాణ్ణిపట్టి బంధించి నా ఎదుట నిలబెట్టండి' అన్నాడు.

భటులు పరకాలుని నగరు చేరుకొన్నారు. పరకాలు నికి నమస్కరించారు. తామెందుకు వచ్చామో విశదపరచారు. 'రాజుగారికి ముట్టజెప్పవలసిన డబ్బును లెఖ్ఖబెట్టి చెల్లించండి. లేకుంటే మీరే రాజుదగ్గరికి మాతో రండి. అన్యథా భావించ కండి. ఇది మీకు తగని చర్య' అన్నారు. వారి మాటలు విన్న పరకాలుడు సహనం వహించాడు. గుట్టు బయటపడనీయ కుండా "నా సీమకు సంబంధించిన 'పసిడి' అంతా ఆనాడే చెల్లించేశాను. ఇంకా ఏదయినా మిగిలి ఉన్నది అంటే అది 'ఉత్తరువు ఉమ్మలియు తోసివేస్తే' చిల్లరగా దానికీ దీనికి పోయింది" అన్నాడు.

కింకరులు ఇంక ఆగలేకపోయారు. పరకాలుని పట్టు కొని లాగారు. ఈడ్చారు.

కింకరుల చేతకు పరకాలుడు ఆగ్రహించి పులి మేలు కొన్నట్లుగా తనచుట్టూవున్న వారలను చూచి 'వచ్చిన భటులను పట్టుకోండి. పొట్టకొవ్విన వీరిని వదలిపెట్టకండి' అన్నాడు.

శౌరికింకరులు కాలకింకరులను తరిమేసేలాగున పర కాలభటులు వారిని పీడించారు. వారిని మొగసాలదాకా లాగి పారేశారు. ఆ భటులు రాజుతో జరిగిందంతా చెప్పారు. తమ ఒంటిమీద గాయాలు చూపారు. మహారాజు ఆగ్రహోదగ్రు డయ్యాడు. వెంటనే దళవాయికి కబురంపాడు.

దళవాయి చతురంగబలంతో కదిలాడు. కాలయ వనుడు ద్వారకను చుట్టిముట్టినట్లుగా చుట్టుముట్టారు. పర కాలుడు భగ్గున మండాడు. కత్తి చేతబట్టాడు. గరుడుని మీదెక్కిన కంసారిలాగా గుర్రమెక్కాడు. సైనికోత్సాహంతో ప్రోత్సాహకరమైన వాద్యఘోషలతో కోటదాటాడు. మిడుతలమీద కార్చిచ్చులాగా, లేళ్ళపై పడే పులిలాగ, పాములమీద గరుడుని లాగా ఆ సైన్యం మీదపడ్డాడు. దండధరునిలాగా ఆ సైన్యాన్ని చీల్చి చెండాడినాడు. ఆ ధాటికి దళవాయి నిలవలేకపోయాడు. బతుకుజీవుడా అని చోళభూపతి దగ్గరికి వెళ్ళి సర్వస్వం నివేదించాడు. అంతా విన్న చోళకాంతుడు

'అద్దిరా! ఎంత చేశాడు అంటూ తానే సామంతులతో, బలమైనసైన్యంతో కదిలాడు. ప్రియురాలిని కనుగొన్న ప్రియుని లాగ ఏమాత్రం భయంలేక రాజును పరకాలుడు ఎదుర్కొన్నాడు. భయంకరయుద్ధం సాగింది. చోళరాజు సైన్యం కకావికలమైంది. చోళరాజు ఆలోచించాడు. ధర్మయుద్ధంకంటె కపటోపాయమే శరణ్యమనుకొన్నాడు.

హితవరులతో– 'నాతో పరకాలుడు చేసిన కయ్యానికి ఎంతో సంతోషించాను. ఒక సీమను మాత్రం పాలించే పర కాలుడెక్కడ? సకలసీమలను ఏలే నేనెక్కడ? సమరంలో నిలబడి గెలిచినవాడే బంటు. చివరదాక పోరాడినవానిని కన్నతల్లే తల్లి' అని సంతోషం ప్రకటిస్తూ.

'మీరు త్వరగా వెళ్ళండి. పరకాలుని శౌర్యానికి రాజు మెచ్చాడని చెప్పండి. ఏదో తెలియక చేసిన అపరాధాన్ని మన్నిం చానని చెప్పండి. అంతేకాదు ముందుకంటె ఇంకా బాగా గౌర విస్తానని విశదం చేయండి. అవసరమయితే అతనికి వాగ్దానాలు చేసి మీతో తోడ్కొని రండి' అని ఆదేశించాడు.

హితవరులు రాజుమాటగా పరకాలునికి సర్వస్వం చెప్పారు. పరకాలుడు వారి మాటలన్ని ఆలకించాడు. అన్నీ నిజమని భావించాడు. పరిమితపరివారంతో చోళరాజేంద్రుని దగ్గరికి వెళ్ళి నిమ్మకాయు' ఇచ్చి నిలబడ్డాడు.

చోళరాజేంద్రుడు పరకాలుని చూచి –

"చీకూచింత లేక ఇంతకాలం సకలరాజ్యం నా వశ మంటూ తెగతిన్నావు. కనీసం నన్ను చూడడానికి వచ్చిన వేళైనా ఒక పచ్చడమూ తేలేదు. తేవాలని కూడా అనుకోలేదు. నీవు ఆర్జించినది మాకు చెల్లించవలసిన ధనమంతా ఇక్కడ పెట్టిపో' అన్నాడు. ఆపై వీని సంగతి చూడండి" అంటూ చోళరాజు అంతఃపురానికి వెళ్ళిపోయాడు. సచివులు ఆలోచించారు.

'డబ్బు జమకట్టేలా చేయండని రాజు మనలను పురమాయించారు. బాగుంది. ఇతనిని ఇబ్బందిపెట్టడంవల్ల ప్రయోజనమేమి? పోనీ అతనిదగ్గర డబ్బుందా? అందు చిల్లి గవ్వకూడా అతనిదగ్గర లేదు. మనమెంత ఇబ్బందిపెట్టినా





ఈ పరకాలుని సంగతి అతనిసీమలో తెలియదు కదా! అంచేత పరకాలుణ్ణి అతని పట్టణానికే చేర్చి అతని బంధువులంతా చూస్తుండగా శిక్షిస్తే కాజేసిన సొమ్ము రాకుండా ఉంటుందా?' అని ఆలోచించి ఆంజనేయుని రాక్షసులు కట్టి తీసికు వెళ్ళే విధంగా పరకాలుని పట్టణానికి వెంటబెట్టుకొని వెళ్ళారు. దారిలో 'కేశవస్వామి'ఆలయం. అక్కడే మూడురోజులు గడిచాయి.

పరకాలుడు బాధతో –

"డబ్బంటే పడిచచ్చేవారికి గురువు, బంధువులు, ఎక్కువవారు, తక్కువవారు లేరు. ఎన్నోమాటలు పడాలి. ఎన్నో ఇవ్వాలి. రమ్మని ఆహ్వానించాలి. ఆ తరువాత అబద్ధాలాడాలి, నరకయాతన పడాలి. సహజం మరి. మదోన్మత్తులైన రాజులకు 'సత్యవాక్కు' ఉందా? చెవిటివాణ్ణి, చెడునడవడికకలవాణ్ణి, దుష్టుని, జూదరిని, డబ్బంటేపడిచచ్చేవాణ్ణి, అవివేకిని, వైష్ణవుల్ని నిందించేవారిని చూడడం తటస్థపడితే తక్షణం సూర్యునిపై చూపు ప్రసరింపజేసి శ్రీ మహావిష్ణువు నామావళిని స్మరించాలంటాడు. ఇవన్నీ తెలిసినవాణ్ణి ఈ దురాచారిదగ్గరికి నేను వెళ్ళకుండా ఉండవలసింది' అని మథనపడి రోజూ వేయిమంది వైష్ణవులకు సాగించే సమారాధన చేయలేని కారణంతో తాను ఆ రోజు ఉపవాసమున్నాడు. చీకటిపడసాగింది. ఆ రాత్రి శ్రీహస్తిగిరీశుడు స్వప్నంలో సాక్షాత్కరించాడు. బాధపడవద్దని తన చేతులతో నివిరినాడు. శంఖామృతంతో మేనెల్లా తుడిచాడు. తన కరుణాకటాక్షాలతో ఊరడించాడు.

పరకాల! నిర్మలాచార! నేను సంపాదించిన ధనమంతా నీకు గాకుండా మరెవరికి? నీకు కావలసినంత నేను సంపా దించిన డబ్బిస్తాను. కంచికిరా' అనుమానించకు' అని అంత ర్ధానమయ్యాడు. పరకాలుడు తన్ను బంధించి తెచ్చినవారితో–

'భటులార! కంచికి నాతో రండి. మీకు ఇవ్వవలసిన డబ్బంతా ఇస్తా. శ్రీహరే ప్రమాణం. నా మాట వినండి' అన్నాడు. సైనికభటులు ఆలోచించారు.

'ఈ పరకాలుడు హరిభక్తుడు. మాట తప్పడు. సరే అన్నారు. అందరు కంచికి పయనమయ్యారు. పరకాలుడు కంచి చేరుకోగానే –

'వనజలోచన! దనుజారి! శౌరి! నీవు సెలవిచ్చినట్లే ఇక్కడికి వచ్చాము. నీ దర్శనమైంది. నా బాధలంతా తీరాయి. రాజుకివ్వవలసిన డబ్బును ఎలా సమకూర్చను? ఈ బాధల నుండి చీకుచింతలనుండి ఎలా బయటపడను?' అని అంగలార్చాడు.

స్వామి పరకాలుని చూస్తూ

'పరకాలా! వేగవతీనదీతీరానికి నీవూ ఆ సైనిక భటులూ రండి. పేరరుళ్‌దాసర్‌పేరుతో తగవరిలా నేను వస్తాను. నన్ను గుర్తుపట్టు. వారికి ధనధాన్యాలు నేను ఇస్తాను. మన వారి వివాదం అక్కడే పరిష్కారమవుతుంది అన్నాడు. ఆలాగే వేగవతినదీతీరం చేరారు పరకాలుడు, సైనికభటులు. పెద్దిరెడ్డి లాగా స్వామి పల్లకిఎక్కి పరకాలుడిదగ్గరికి స్వామి వచ్చాడు. దగ్గరిబంధువుల్ని చూచినట్లుగా పరకాలుని చూచి సంతోష పడ్డాడు. పల్లకి దిగాడు. 'అన్నా! ఏమిటి ఇలా ఉన్నావు. నీ చుట్టూ ఈ భటులేమి? అని ఏమీ తెలియనివాడిలాగా ప్రవర్తించాడు. పరకాలుడు 'సర్వం' విదితం చేశాడు.

'ఇంతదానికేనా పరకాలుణ్ణి ఇబ్బందిపెట్టడం. వెళ్ళండి. దూరంగా వెళ్ళండి' అన్నాడు.

ఆ సైనికభటులు –

'చాల్లే! పరాంకుశుని వదలిపెట్టమంటారేమిటి? ఎందుకు వదలాలి? అతడివ్వవలసిన డబ్బంతా ఇస్తే పరకాలుని మీ కప్పగించి మేము చక్కాపోతాము' అన్నారు. 'ఆలాగా! ఎన్ని సొమ్ములిచ్చినా మీకు దక్కేది చివరకు మీ ఒంటిమీది సొమ్మేకదా. పనిలేని మాటలెందుకు? ధనమెంత కొలుచెంత వీసం తక్కువ కాకుండా మీకు ఇస్తా.' అంటూ పరకాలుని వెనక్కిలాగాడు పెద్దిరెడ్డి. తదనంతరం తనమాయతో కొలుచు, ధనం తెమ్మని ఆనతిచ్చాడు తన సేవకులకు. సేవకులు ఆలాగే ధనం కొలుచి పట్టుకొచ్చారు. కొలిచేవేళ 'చేతివాటం' చూపారు. అటూ ఇటూ కొలిచినారు. 'గోవిందా' అంటూ మొదటి కొలుచు కొలిచారు. ఏది కొలుస్తున్నారో ఏది పక్కకు వేస్తున్నారో తెలియరానివిధంగా కొలుస్తున్నారు. బరువున్నట్టు, ఎక్కువ భారమున్నట్టు చిత్రగతు లతో తూచారు.

ఆ తరువాత సొమ్ము చెల్లించినందుకు 'చెల్లుచీటి' ఇమ్మని ఆదేశించాడు. అరికాలులో ముల్లంతయినా మిగలనట్లు జాడించి 'చాలా! వెళ్ళవచ్చా నేను' అంటూ మేనిసొమ్ములతో పెద్దిరెడ్డి తన ఆవాసం చేరుకొన్నాడు. **(ఇంకా ఉంది)**


ఔన్నత్యం సంపదలవల్ల రాదు - సద్గుణాలవల్ల వస్తుంది

నవంబరు - 01 న

## కైశికద్వాదశీ (క్షీరాబ్ధిద్వాదశి) ఆస్థానోత్సవం

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి సన్నిధానంలో ప్రతి సంవత్సరం కార్తికశుద్ధద్వాదశి (క్షీరాబ్ధిద్వాదశి)యందు ఆస్థానోత్సవం జరుగుతుంది.

శ్రీవారికి ప్రాతఃకాలారాధనం అయినవెంటనే అపరావతారమైన ఉగ్రశ్రీనివాసమూర్తివారు ఉభయనాంచారులతో కూడి బంగారుతిరుచ్చిలో వేంచేస్తారు. విశేషతిరువాభరణాలు సమర్పిస్తారు. విశేషపుష్పమాలలచేత అతిరమణీయంగా అలంకరింపబడి అరుణోదయకాలంలోనే ఆనందనిలయ విమాన ప్రదక్షిణంగా చతుర్వీధులఉత్సవానికి స్వపరివారంతో వేంచేస్తారు. చతుర్వీధుల ఉత్సవం పూర్తై సూర్యోదయంకాకమునుపే మండపంలోనున్న సర్వభూపాలవాహనంలో వేంచేస్తారు. పిమ్మట శ్రీవారికి ఆస్థానాలంకారం, ఆరాధనం, తళిగలు నివేదనం జరుగుతాయి. కైశికద్వాదశీఆస్థానం ప్రారంభమౌతుంది.

శ్రీస్వామివారికి అక్షతారోపణం జరిగినమీద శ్రీవారి పాదాలవద్దనున్న కైశికపురాణాన్ని కాలక్షేపం చేయటానికి కోటి కన్యాదానంవారికి పరివట్టం కట్టి ఇస్తారు. వారు భక్తజనానికి కైశికభక్తచరిత్రమును కాలక్షేపం చేస్తారు. పూర్తైనవెంటనే వారికి బహుమానం జరుగుతుంది. తర్వాత పంచముఖాల కొలువు జరుగుతుంది. తర్వాత హారతులు అయి జియ్యంగారువారికి, సర్కారువారికి మర్యాదలు జరిగిన తర్వాత గోష్ఠికి స్థాన బహుమానపూర్వకంగా శ్రీవారిప్రసాదం వినియోగం జరుగుతుంది. ఆరాధనమైనతర్వాత శ్రీతాతాచార్యులవారికి శ్రీస్వామివారి సన్నిధానంలో మర్యాదలు జరిపి వారిని విడిదికి పంపిస్తారు. శ్రీవారు సన్నిధానంలోకి ప్రవేశిస్తారు. ●



నవంబరు - 30 న

## చక్రతీర్థముక్కోటిఉత్సవం

తిరుమల శ్రీశేషపర్వతంపైనున్న శ్రీ వేంకటేశ్వరస్వామి వారి సన్నిధానానికి కొన్నిమైళ్లదూరంలోనున్న చక్రతీర్థంలో వృశ్చికమాసం శుద్ధద్వాదశియందు చక్రతీర్థముక్కోటిఉత్సవం జరుగుతుంది.

ఆ రోజు శ్రీస్వామివారికి ప్రాతఃకాలారాధనం, మాధ్యాహ్నికారాధనం పూర్తైన తర్వాత అర్చకులు, పాచకులు, పరిచారకులు, ఉద్యోగులు, ఏకాంగి, భక్తులు అందరు మంగళవాయిద్యాలతో మహాప్రదక్షిణంగా చక్రతీర్థానికి వెళ్తారు. అచ్చటనున్న శ్రీచక్రత్తాళ్వారుస్వామివారికి, శ్రీనృసింహస్వామివారికి, శ్రీఆంజనేయస్వామివారికి అభిషేకం, పుష్పాలంకారం, ఆరాధనం జరుగుతాయి. తర్వాత నివేదనం, హారతియైన తర్వాత గోష్ఠికి వినియోగం జరుగుతుంది. తర్వాత మంగళవాయిద్యాలతో అందరు శ్రీవారి సన్నిధానానికి వస్తారు. ఈ చక్రతీర్థాన్ని గురించి స్కందపురాణమిలా చెప్తోంది.

పూర్వకాలంలో పద్మనాభమహర్షి అనే భక్తుడు పండ్రెండుసంవత్సరాలు అన్నం నీళ్లు ఏమాత్రము తీసుకోక కేవలం గాలిని మాత్రమే స్వీకరించి భగవంతునిగూర్చి గాఢమైన తపస్సును గావించాడు. ఆ తపస్సుకు సంతోషించి శ్రీవేంకటేశ్వరస్వామి ఆ పద్మనాభమహర్షికి ప్రత్యక్షమై ఓ పద్మనాభమహర్షీ! నీవు ఈ చక్రతీర్థంలోనే కల్పాంతంవరకు ఉండి నన్ను పూజిస్తూండు అని చెప్పి అంతర్థానమైపోయాడు. పద్మనాభ మహర్షి శ్రీస్వామివారి ఆజ్ఞను శిరసావహించి ఆ చక్రతీర్థంలోనే తపస్సు చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఒక రాక్షసుడు ఆ మహర్షిని ఆహారంగా చేసుకోవాలనొచ్చాడు. అందుకు భయపడి ఆ మహర్షి స్వామివారిని రక్షించుమని ప్రార్థించాడు.

ఆ ప్రార్థనకు స్వామి తన చక్రాయుధాన్ని పంపి రాక్షసుని శిరస్సు ఖండించాడు. అప్పుడు ఆ మహర్షి చక్రరాజమనే స్తోత్రాన్ని చేసి ఓ చక్రరాజమా! నీవు భక్తరక్షణార్థమై ఈ తీర్థంలో ప్రవేశించు అని కోరాడు. ఆ చక్రరాజమలాగే చేసింది. అప్పటి నుండి ఈ తీర్థం చక్రతీర్థమని ప్రఖ్యాతి గాంచింది. ఆ చక్రతీర్థంలో స్నానం చేసినవారికి కూడా రాక్షసబాధలు తొలగిపోతాయని ఐతిహ్యం. ●

# మధురభక్తి భావతరంగాలు

– 'సారస్వత కళానిధి' డా॥ వెలువోలు నాగరాజ్యలక్ష్మి

భారతీయసాహిత్యంలో మధురభక్తిశాఖ పూచి, కాచి, ఫలించింది. భాగవతం, శ్రీకృష్ణకర్ణామృతం, గీతగోవిందం సంస్కృతంలో మధురభక్తిశాఖలో వెలసిన సుధాకళికలు. "వాసుదేవః పుమానేకః నార్యశ్చ సకలం జగత్" అనీ, గోవింద ఏవ పురుషో బ్రహ్మాద్యాఃస్త్రియ ఏవచ" అనీ ప్రాచీనులు వర్ణించారు. "పుంసాం మోహనరూపాయ" అని పురుషోత్తముని సౌందర్యం పురుషులకు సహితం మోహం పుట్టించేదిగా ఉందని కీర్తింపబడింది. ఇది కేవలం లౌకికమైన మోహం కాదు. జీవాత్మ పరమాత్మల వియోగ, సంయోగాలకు సంకేతం. జీవుడు తాను పరమాత్మలోలయం చెందాలనుకోవటం దీని ముఖ్యోద్దేశం. సర్వాత్మసమర్పణం దీని స్వభావం. గోపికాకృష్ణులు జీవాత్మ పరమాత్మల మధురభక్తికి పర్యాయపదాలుగా పేర్కొనదగ్గవారు. రవీంద్రుని "భానుసింహపదావళి'లో, మీరాబాయి పదావళిలోనూ, మహారాష్ట్రుల అభంగగీతాలలోనూ ఈ తత్త్వమే కన్పిస్తుంది. యుగయుగాల విశ్వమానవుని మధురసాధన, భగవంతుని నుండి విడివడ్డ తాను తిరిగి భగవదైక్యం చెందాలని, స్వామిపాదాలను ఆశ్రయించాలని అనునిత్యం సాగుతూ ఉంటుంది. పరమాత్మలో లీనమయ్యే కాంక్షతో భక్తుడు తదన్వేషణ ప్రారంభిస్తాడు. బహిరింద్రియ నిర్ణీతాలైన ఎల్లలను దాటి కనిపించని సూక్ష్మప్రకృతి లోనికి ప్రవేశిస్తాడు. ఆ ప్రకృతిని ఆవిష్కరించే ప్రయత్నం చేస్తాడు. భౌతిక ప్రపంచంలోని సమస్త పదార్థాలలోనూ పరమాత్మ స్వరూపాన్ని దర్శిస్తాడు. తన్నుతాను భగవంతుని సాధనంగా భావించుకుంటాడు. దైవసాయుజ్యం కోసం పరితపిస్తాడు. దానికోసం ప్రకృతిలోని వృక్షాలను, లతలను, కోకిలలను, తుమ్మెదలను చెలులుగా భావించుకొని ప్రాణేశ్వరుని గురించి ప్రశ్నిస్తాడు. సందేశం పంపిస్తాడు.

**"మల్లియలార! మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే"**

**(భాగ. దశమ. పూర్వ)**

అని గోపకాంతలు ప్రకృతిలో పరమాత్మను అన్వేషించారు. బాలగోపాలుని వేణుగానమాధుర్యాన్ని ఆస్వాదించాలని ఉవ్విళ్లూరారు. వేణుగానం శ్రీకృష్ణుడు గోపికలను ఆకర్షించే సాధనం మాత్రమే కాదు. దీనిలో ఒక గంభీరతత్త్వం దాగి ఉంది. జీవాత్మ, పరమాత్మ నుండి గోపికల రూపంలో విడివడి ఉంది. ఖండవస్తువు అఖండత్వసిద్ధిని పొందటానికి ఉత్కంఠ పొందుతుంది. అంటే జీవాత్మ పరమాత్మలో లీనం కావటానికి పెనుగులాడుతుంది. ఈ రెండింటి మధ్య ఉన్న వేదనను బలీయం చేసేది వేణుగానం. విశ్వనాథవారు అందుకే దీన్ని బ్రహ్మగీతం అన్నారు.

ఈ తాత్త్వికాంశ, మధురభక్తి భావవ్యంజకంగా "ఒక వేణువు పలికింది"అనీ "అంతరగాంధారం" అనీ, "వెన్నెల్లో వేణుగానం"అనీ ఆదూరి సత్యవతీదేవి తమ గేయసంపుటులకు నామకరణాలు చేశారు. తాము వేణువు కావాలని ఆకాంక్షించారు.

**చిగురంతటి నీప్రేమకొరకు**
**పడిపడి నీ వాకిటనే తిరిగెదను - (విరహార్తిని)**

అని భగవంతుని ఆదరణకై విరహాతురగా కన్పిస్తారామె.

వీరి భక్తికవిత్వంలో సహజ వినమ్రతా విశేషం ప్రస్ఫుటం. ప్రకృతి ప్రభావం అధికం. కవితామార్గంలో సత్యాన్వేషణ దీక్షగా సాగించిన హృదయకవయిత్రి సత్యవతీదేవి. జీవితాన్ని రసయోగంగా భావించి మానవసంబంధాల్లోని ప్రేమ, ఆర్ద్రతలను అత్యద్భుతంగా చిత్రించిన భావుకురాలు. మనస్సు అంతరాంతరాల్లోని ఆర్తిని 'వెన్నెల్లో వేణుగానం'గా వినిపించారు. ఎద సవ్వడులలో కదలాడే చిన్నికన్నయ్య మువ్వల లయ ఆమె 'ఆత్మరాగం'గా రూపుదిద్దుకుంది.

**పంజరాన్ని చుట్టుకొని పక్షి విలపిస్తోంది**
**దూరాన కదలలేక తోట ఎదురుచూస్తోంది (వెన్నెల్లో వేణుగానం)**

లౌకికజీవనం అనే పంజరం నుండి విడివడి స్వేచ్ఛగా అలౌకిక స్థితిని పొందాలనే ఆరాటం ఈ గీతంలో ద్యోతకమవుతుంది.

సత్యవతీదేవి కృష్ణభక్తురాలు. ఆమె రచించిన లలిత, భక్తిగీతాలలో అధికభాగం ఆ యశోదాతనయుడిపై కూర్చినవే. ఆధ్యాత్మికభావనతో ఆమె రచించినగీతాలు మధురభక్తిని ఒలికించాయి. 'వెన్నెల్లో వేణుగానం' తాత్త్వికభావ సంభరితం.

**పాట నా ప్రాణము / పక్షి నా నేస్తము**
**వనము నా మార్గము / కవనమే నా స్వర్గము**

– అంటూ తమ అంతరంగాన్ని ప్రకటించుకున్నారు. భక్తి భావప్రవాహంలో పరవశించిపోయారు. పరమాత్మలోనూ,



అంతరాత్మే మనిషిని సరైనదార్లోకి మళ్లించి కార్యోన్ముఖుణ్ణి చేస్తుంది

పరమాత్మస్వరూపమైన ప్రకృతిలోనూ సంలీనం కావాలని తపించారు.

**పువ్వు పువ్వున నీవు పులకరించి వుండగ**
**పూజలెవ్వరికి చేయగలను స్వామీ**

అని భక్తిపారవశ్యంలో తాదాత్మ్యం చెందారు. ఆమె గీతాలు "నృత్యమై, సాహిత్యమై, గీతమై, సంగీతమై, భక్తి పదముల ముక్తి తెరువల / ఉరకలెత్తిన జ్ఞానగంగలు"

భగవంతుని దివ్యసన్నిధిని అనుభూతి చెందటానికి, ఆధ్యాత్మికజగత్తులో మైమరచిపోవటానికి సంగీతం చక్కని సాధనం. హృదయ ద్రవీకరణశక్తి కలిగిన లలితకళలలో సంగీతానిది అగ్రతాంబూలం. అందుకేనేమో సత్యవతీదేవి పాటను గురించి పలుకుతూ–

**ఒక పాట నా పాలి పరచింతనామృతము**
**ఒక పాట నా పాలి రసయోగ సౌఖ్యము**
**ఒక పాట నాపాలి లలిత కవితావనము**
**ఒక పాట నాపాలి ప్రణయలోకపథము (పాటసిరులు)**

అన్నారు. భక్తిపారవశ్యంలో మునిగినవారు భగవంతుడు తనకు కనిపించాలని కోరుకుంటారు. సాటివ్యక్తితో సంభాషించినట్లు దైవంతో సంభాషిస్తారు. మధురభక్తిలో ప్రాణతుల్యమైన ఆ అనిర్వచనీయానుభూతి వీరిగీతాలకు ఊపిరులూదింది.

**రావనుకున్నాను - వెలుగే లేదనుకున్నాను**
**కన్నీరై కరగికరగి చెరగా యీ బ్రతుకు గడిపి**
**విలపించే వేళలో....**
**ఒక కమ్మని స్వరముతాకెను / ఒక వెన్నెల తునక వాలెను**
**......**
**నీవనుకున్నాను - ఆ వెలుగే నీదని విన్నాను**
**- (రావనుకున్నాను)**

గీతాలలో అభివ్యక్తమైన వీరి భక్తిభావతరంగాలు పఠితల హృదయాలలో కూడ అతిలోకమైన ఆధ్యాత్మిక భావనలకు ఆలవాలాలు. "గానమే ఆనందం– సంగీతజ్ఞానమే బ్రహ్మానందం" అని మనస్సులో పాడుకున్న గీతాలన్నీ ఆమె అనుభూతి స్పర్శలే. కాంక్షాస్వప్నాలే.

**నా కవనములునీవే - నా గానములునీవే**
**నాలోపల నీవే - నా ప్రాణమునీవే**

అని ఆత్మార్పణం చేసుకున్న ధన్యజీవి సత్యవతీదేవి. జీవుడేకాదు, సృష్టిలోని ప్రతిద్రవ్యమూ పరమాత్మ నాదలహరిలో లీనం కావటమే అంతిమగమ్యం అనే భావనవారి భక్తితత్త్వానికి పరాకాష్ఠ.

తానే రాధగా, గోపికగా, వంశీగా మురిసిపోయారు. వీరు రచించిన సంగీతనృత్యరూపకం "ఇంతిరో ఈ గోప బాలుడు"లో

**ఎంతవెదికినా కనిపించవుగా**
**ఏమని పిలచినా బదులివ్వవుగా**

–అని యశోదయై కృష్ణునిదర్శనంకోసం పరితపించారు.

**వదలని ఆశలో నినుకోరి / పడిపడి వచ్చే ఈ వేళ /**
**ఏదయా నీ మురళీ**

– అని రాధయై కవితాతీరంలో నిరీక్షించారు.

"మ్రోయించరా మురళి మళ్ళీమళ్ళీ" అని గోపికయై పరవశించారు. "రావోయి వనమాలీ – నేడిటురావోయి" అని తమ అంతరంగవేదిక పైకి ఆహ్వానించారు. ప్రకృతి పరీమళాలలో "కనిపించని కళాకారు"ని చూడాలని ఆత్రుత చెందారు.

శ్రీరామచంద్రుడు వస్తున్నాడని తెలిసి అలనాడు శబరి ఆత్రుత పడుతుంది. "అసలే ఆనదు చూపు / ఆపై ఈ కన్నీరు/ తీరా దయ చేసిన / నీ రూపు కానదయ్యెయ్యో" (దేవులపల్లి కృష్ణశాస్త్రి) అని వాపోతుంది. ఆ భక్తురాలి ఆరాటం అటువంటిది. పరమాత్మ స్వయంగా వచ్చినా జీవాత్మ అందుకోలేని అశక్తత వహించి ఉంటుందనే ఆ లలిత లలితమైన భావసంపద సత్యవతీదేవిగారి గీతాలాపనలో ముగ్ధమనోహరంగా ఒదిగింది.

**ఎపుడైనా నీ పిలుపుగాని వినబడినా**
**భవదీయ చరణయుగళి కనబడినా**
**వంగివాలి తొందరైతి అందుకోని మందమతినై**
**చిగురించని కాలగతిన శిలనై పడియుందునని**
**భయమొందితి స్వామీ - తిరుమలగిరి స్వామి**

ఈ మధురభక్తిగీతాలు సత్యవతీదేవి నిలువెత్తు భక్తిభావగరిమకు ఎత్తిన పతాకలు. 





# పుష్పయాగ వైశిష్ట్యం

- డా॥ వి.పళని

యజ్ఞం, యాగం, మఖం, క్రతువు, సవనం అధ్వర్యం, సప్తతంతు, సవం - ఇవన్నీ వ్యుత్పత్తుల్ని బట్టి అర్థభేదాలున్న తాత్పర్యంమాత్రం- పూజించడమనే అర్థంలోనే పర్యవసిస్తాయి. మనకు సాధారణంగా 'యజ్ఞం, యాగం' అనే పదాలు సుపరిచితాలు. 'యజ' ధాతువు నుండి యజ్ఞ, యాగశబ్దాలు ఏర్పడ్డాయి. 'యజ' అంటే పూజించడం. 'యజతే యజ్ఞః' అట్లే 'యజనం యాగః'- ఈ రెండూ కూడా 'పూజించడం' అనే అర్థాన్నే ఇస్తున్నాయి. భక్తిశ్రద్ధల్తో భగవంతుణ్ణి పూజించడం, నామజపం చేయడం, నెయ్యి మున్నగు వస్తువుల్తో అగ్ని ద్వారా అర్పించడం- ఇవన్నీ భగవంతుణ్ణి పూజించే పద్ధతులే! విశ్వనిర్మాణమే యజ్ఞ స్వరూపం. యజ్ఞమే విష్ణువు. కనుక, యజ్ఞకర్మ పరమాత్మను ఆరాధించడమే!

పుష్పయాగమనేది అనేకవిధ సుగంధపుష్పాలతో భగవంతుణ్ణీ, భగవతినీ పూజించడమే! ఇది అగ్నిముఖంగా... ఆహుతులతో కూడిన యాగం కాదు. ఇదొక శాంతియాగం. దోషపరిహారార్థం చేసే క్రియ. కపింజలసంహిత (24-2).

ధ్వజారోహణ తీర్థాంత
ప్రాయశ్చిత్తంతు యద్భవేత్।
తస్యదోష విఘాతార్థం
పుష్పయాగం చ కారయేత్॥

ఉత్సవాలలో ధ్వజారోహణం నుండి అవభృథస్నానం దాకా జరిగిన కార్యకలాపాల్లో చిన్న చిన్నలోపాలూ, దోషాలూ చోటు చేసుకుంటుంటాయి.

పుష్పయాగం- పుష్పమంటే 'వికసించేది' అని వ్యుత్పత్తి. వికసించడం ఆనందలక్షణం. ఇట్టి లక్షణం గల్గిన సువాసన గల పుష్పాలతో - భగవంతుణ్ణి విశేషంగా పూజించడం పుష్పయాగం. నిత్యారాధనలోనూ పుష్పపూజలు ఉన్నా-అవి ఒక్కొక్కటిగా సమర్పిస్తారు. పుష్పయాగంలో అలాకాక రాశులుగా సమర్పిస్తారు. ఇది పుష్పయాగం. అది పుష్పపూజ. దేవాలయాల్లో దేవదేవుణ్ణి సేవించడంలో ఎన్నో రకాల పూజలు చేస్తున్నాం. పత్రాలు, పూలు, సుగంధమంగళ ద్రవ్యాలు సమర్పిస్తున్నాం. ఆ ప్రక్రియాల్లో భాగంగానే పుష్పయాగాన్నీ ఒక విశిష్టప్రయోజనంకై వైష్ణవ దేవాలయాల్లో చేస్తారు. స్వామిని పాదాలనుండి క్రమంగా కంఠం వరకూ పూలతో విశేషంగా అలంకరించడం- అంటే రాశిగా పోసి, స్వామివారి లేదా అమ్మవారి ముఖం మాత్రం కన్పించేంతవరకు పూలు సమర్పించడం ఇందలి విశేషం. ఈ సమయంలో ఆగమానుసారం- వేదసూక్తాలూ, ఉపనిషత్తులూ పఠిస్తారు.





ఇతరుల్ని క్షమించగల్గటమే నిజమైన ధైర్యం కల్గిఉండటం

## పుష్పయాగ సమయాలు

ప్రతిష్ఠాంతంలో, ఉత్సవాంతంలో, తులాసంక్రమణంలో కటకమకరసంక్రమణాల్లో, సూర్యచంద్రగ్రహణాంతాల్లో, యుగాంతంలో, సంక్రాంతిలో శ్రవణనక్షత్రంలో, చక్రవర్తి జన్మ నక్షత్రంలో, గ్రామయజమాని జన్మనక్షత్రంలో, ఆకాశంలో చూడ రాని ఉత్పాతాలు చూచినపుడూ, రాష్ట్రం అల్లకల్లోలంగా ఉన్న ప్పుడూ, దేశం దుర్భిక్షస్థితిలో ఉన్నప్పుడూ, అనావృష్టి ఏర్పడి నప్పుడూ, శత్రువులు దండెత్తి వచ్చినపుడూ, మహావ్యాధులు వ్యాపించినప్పుడూ, ఏవైనా దేశోపద్రవాలు కల్గినప్పుడు, శాస్త్రోక్త విధానంలో మహావిష్ణువునకు స్నపనతిరుమంజనం చేసి, మరు నాడు పుష్పయాగం చేయడం శుభప్రదం అన్నారు – పెద్దలు.

## పుష్పయాగ ప్రయోజనం

పుష్పయాగం చేస్తే అశ్వమేధ యాగం చేసినంత ఫలం కల్గుతుంది. పుత్రసంతానం లేనివారికి పుత్రులు కలుగుతారు. తన తరాలవారూ, తన తర్వాతి పదితరాలవారూ, తనతరం వాళ్లు మొత్తం 21 తరాలవాళ్లు విష్ణుదేవుని అనుగ్రహపాత్రులై తరిస్తారు. ఈతి బాధలనుండి విముక్తులవుతారు. దేశం సుభిక్షంగా ఉంటుంది.

## పనికి వచ్చేపూలు

జాజులు, సంపంగెలు, తామరలు, కలువలు, మల్లెలు, పారిజాతాలు, చేమంతులు, గన్నేరుపూలు, నందివర్ధనాలు, మందారాలూ, దేవదారుపూలు, పొగడలు, సురపొన్నలు, బండిగురివిందపూలు మొదలైనవి – సురపొన్నలు, బండి గురి విందపూలు మొదలైనవి సువాసనగలవి శ్రేష్ఠం.

ఇందులో తెల్లపూలు శాంతిని కల్గిస్తాయి. పసుపు రంగువి పుష్టిని కల్గిస్తాయి. నల్లనివి వశీకరణం చేస్తాయి. ఎరుపు రంగువి శత్రువిద్వేషాన్ని హరిస్తాయి. పుష్పయాగంలో అన్ని రంగులపూలు వాడడం శ్రేష్ఠం. రెండురంగులతో పూజించడం మధ్యమం. ఒకే రంగుపూలతో పుష్పయాగం చేయడం అధమం. అప్పుడే పూచినపూలు శ్రేష్ఠం. భక్తులు స్నానంచేసి, బాహ్యాంత శ్శుద్ధులై, పూలచెట్లకు నమస్కరించి, శుద్ధమైన పాత్రల్లోనికి– "భగవంతునికి ప్రీతికరమైన పూలను, ఆయన కోసమైకోస్తు న్నాను" అని సంకల్పించి పూలుకోయాలి.

## సాహిత్యంలో పుష్పయాగ ప్రస్తావనలు

శ్రేష్ఠలూరి వేంకటార్యుడు పుష్పయాగోత్సవాన్ని –

**అంతవైఖానసులాయుత్సవమున**
**అంతరాయముల ప్రాయశ్చిత్తముగను,**

**శ్రీనివాసులకు విశేషార్చనములు**
**జానూరు కటినాభి సద్వత్సబాహు-**
**గళముఖమౌళ్యంత కలితక్రమమున**
**తలప పద్మాదిక దశ విధార్చనలు**

**గావించి, నల్దెస క్రమమున నిల్పి**
**భావించి సూత్రోక్త పరిపాటి సల్పు**
**పుష్పయాగం బెంతొ పొలుపొందెనపుడె**
**పుష్పవర్షము నభో భూజముల్ గురియ ॥**

అని వివరించాడు తన 'శ్రీనివాసవిలాససేవధి'లో (6–1141–1150 పంక్తులు)

అన్నమాచార్యులవారు పుష్పయాగ వైభవాన్ని–

**సకల లోకేశ్వరుడు సరసజేకొనువాడు**
**అకలంకముగ పుష్పయాగంబు**

**వివిధ పుష్పములతో వేద ఘోషములతో**
**ఆవల దిరుణముడియు నంగనలయాటతో**
**కవి వందినుతులతో కమ్మబూజులతోడ**
**నవధరించీ బుష్పయాగంబు**

**కపురపుటారతుల ఘనచందనముతోడ**
**తెప్పల ధూమముల తిరువంది కాపుతో**
**వొప్పగ బణ్యారములు వొగిం చెక్కువలతో**
**అప్పడందీ పుషయాగంబు (30-209)**

సాంగోపాంగంగా వర్ణించారు.

పుష్పయాగంలో సమర్పించే పూలసువాసనలు, స్పర్శ, ఆ యా రంగుల్ని చూడడం వల్ల – హృదయంలో సద్భావాలు.

మన ఆలయాల ఉత్సవాలలో, ప్రతిష్ఠాదులలో పుష్ప యాగం నిర్వహించడం పరిపాటి అయింది. అంతేకాక ఆ యా దేవతల ఉత్సవమూర్తుల్లో సౌకుమార్యం, ప్రసన్నత, తేజస్సు రెట్టింపుకావడానికీ ఈ పుష్పయాగ – పుష్పార్చన విశేషంగా దోహదమవుతుంది.







# తల్లి దర్శనం ఆనందం.. ఆరోగ్యం... ఐశ్వర్యం....

**చిన్నశేషవాహనం**
అదివో! అల్లదివో!
సిరులతల్లి చినశేషవాహనోత్సవ దర్శనం!
అశేష దోషసమూహాలకు పలాయనం!

**పెద్దశేషవాహనం**
ఏడుపడిగెల పెదశేషునిపైన...
తల్లి శ్రీపద్మావతిని దర్శిస్తే చాలు!
సిద్ధిస్తాయి కోరికలు పదివేలు!!

**హంసవాహనం**
సోహం, సోహం అంటూ బంగారుహంసపై
విహరించే జ్ఞానదాత్రి శ్రీపద్మావతిని దర్శించండి!
పరమ హంసలై అధ్యాత్మవీథుల్లో విహరించండి!!

**ముత్యపుపందిరి**
అదివో! ముత్యాలపందిరి క్రింద ముచ్చటగా
మురిపిస్తున్న శ్రీపద్మావతి!
చల్లగా అనుగ్రహిస్తున్న ఆ చక్కని తల్లికి చాంగుభళా!

**సింహవాహనం**
అరివీర భయంకరి అలమేలుమంగ!
భక్తులను అరి షడ్వర్గాలనుండి రక్షించుట కొరకు
సింహవాహినియై వస్తోంది!
జయహో మాతా! జయ జయహో!!

**కల్పవృక్షవాహనం**
కల్పవృక్షం నీడలో కొండలరాయుని
పట్టపు దేవేరి శ్రీపద్మావతి! కొసరి కొసరి కోరండి!
ఇచ్చేను కొండలంత సిరులు!

**హనుమద్వాహనం**
ఆనాటి శ్రీరాముణ్ణే, ఆ రాముని 'రామ'నూ నేనే!
అంటూ రామబంటు హనుమంతునిపై
నయనాభి రామంగా దర్శనమిస్తున్న
శ్రీవేంకటేశుని రమణీలలామ అలమేలుమంగ!

**పల్లకిలో మోహిని**
అదె! చూడరో! మోహినీరూపం!!
అదె మొక్కరో! శ్రీవైకుంఠాన్నే భువికి తెచ్చిన
సింగారాల శ్రీదేవి సమ్మోహనరూపం!!





15-11-2017 బుధవారం
రాత్రి: చిన్నశేషవాహనం



తిరుచానూరు
శ్రీ పద్మావతీఅమ్మవారి
బ్రహ్మోత్సవాలు
2017 నవంబరు
15 నుండి 23 వరకు



16-11-2017 గురువారం
పగలు: పెద్ద శేషవాహనం



16-11-2017 గురువారం
రాత్రి: హంసవాహనం



17-11-2017 శుక్రవారం
పగలు: ముత్యపుపందిరివాహనం



17-11-2017 శుక్రవారం
రాత్రి: సింహ వాహనం



18-11-2017 శనివారం
పగలు: కల్పవృక్ష వాహనం



18-11-2017 శనివారం
రాత్రి: హనుమద్వాహనం



19-11-2017 ఆదివారం
పగలు: పల్లకివాహనం


తిరుచానూరు
శ్రీ పద్మావతీఅమ్మవారి
బ్రహ్మోత్సవాలు
2017 నవంబరు
15 నుండి 23 వరకు
19-11-2017 ఆదివారం
రాత్రి: గజవాహనం
20-11-2017 సోమవారం
పగలు: సర్వభూపాలవాహనం
20-11-2017 సోమవారం
రాత్రి: గరుడవాహనం
21-11-2017 మంగళవారం
పగలు: సూర్యప్రభ వాహనం
21-11-2017 మంగళవారం
రాత్రి: చంద్రప్రభ వాహనం
22-11-2017 బుధవారం
పగలు: రథోత్సవం
22-11-2017 బుధవారం
రాత్రి: అశ్వవాహనం

**గజవాహనం**

అదిగదిగో! దర్శించండి!
గజరాజుపై గంభీరంగా విహరిస్తున్న శ్రీమహాలక్ష్మి!
గజలక్ష్మియైన శ్రీపద్మావతి గజాంత ఐశ్వర్యప్రదాయిని!!

**సర్వభూపాలవాహనం**

అదో! దర్శించండి సర్వభూపాల వాహనంలో...
సప్తగిరీశుని రాణి! ఆమే అమరవందిత అలమేలుమంగ!
ఆర్తుల దప్పి దీర్చే ఆకాశగంగ!!



**గరుడవాహనం**

వేదస్వరూపుడు గరుడునిపై దర్శనం ఇస్తున్న...
వేదమాత శ్రీపద్మావతి!
'ఇటు గరుడని నీ వెక్కినను పట పట దిక్కులు పగిలె'
అంటూ కైమోడ్పులు చేస్తున్న భక్తజనం!

**సూర్యప్రభవాహనం**

సూర్యప్రభ పసిడికాంతుల్లో...
వేయివెలుగులతో శ్రీవేంకటేశురాణి అలమేలుమంగ!
ఆ తల్లి దర్శనం ఆరోగ్యం, ఆనందం, ఐశ్వర్యప్రదం!

**చంద్రప్రభవాహనం**

చక్కదనాల చుక్కలరేడు చందమామ,
తెల్లని చంద్రప్రభలో చంద్రసహోదరి,
సొంపుకళల చల్లని తల్లి పద్మావతి!
ఆ తల్లిని దర్శిస్తే చాలు, మనకు కలుగుతుంది మనశ్శాంతి!!



**రథోత్సవం**

తిరుచానూరు తిరువీధుల్లో మెలమెల్లగా...
ముందుకు సాగుతున్న తిరుమలేశుని రాణి దివ్యరథం!
ఆ రథోత్సవ దర్శనం... మనోరథాల్ని తీర్చే దివ్యసందర్శనం!

**అశ్వవాహనం**

'నీవు తురుగముపై మెరయు'- అన్నట్లు
అశ్వవాహనంపైన అలరిస్తున్న అలమేలుమంగ!
కలికల్మషనాశనం ఆ అమ్మదర్శనం!!

**వసంతోత్సవం**

'వాడల వాడల వెంట వసంతము,
జాడతో చల్లేరు నీపై జాజర జాజర' - అన్నట్లు
సకియలతో వసంతాలాడుతున్న
వయ్యారిభామిని శ్రీఅలమేలుమంగ!



# అంతశ్శత్రునాశం- గీతాబోధలక్ష్యం

- శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి

**నవంబరు - 30**
**గీతాజయంతి సందర్భంగా....**

**దేశంలో రోజురోజుకూ ఎన్నో గ్రంథాలు వెలువడుతూంటాయి. నవలలు, నాటకాలు, కథలు, సాహిత్య గ్రంథాలు, చారిత్రక, వైజ్ఞానిక పరిశోధనలకు సంబంధించిన పుస్తకాలిలా ఎన్నో వెలువడుతూంటాయి. కాని ఈ గ్రంథాలన్నింటిలోను ఒక్కగ్రంథాన్ని మాత్రం ప్రతిఒక్కరూ నిత్యమూ పఠిస్తూంటారు. అదే హిందూమత పవిత్రగ్రంథం శ్రీ భగవద్గీత. ఇది ప్రతి ఒక్కరి జీవితానికి నిఘంటువువంటిది. కాబట్టి గీత మానవునికి జీవనయాత్రయందు అతి ప్రయోజనకరమైన గ్రంథమనటంలో ఎంతమాత్రమూ సంశయం లేదు.**

### కలికాలభేషజం

కలికాలంలో ధర్మం ఏకపాదాన ఉంటుందని కాబోలు (లేక) కలి తన శక్తితో విజృంభించి జనులను దుష్టమార్గంలో నడిపించి భ్రష్టుల్ని చేస్తాడేమోనని కాబోలు, దయార్ద్రహృదయుడైన పరమాత్మ కృష్ణావతారాన్నెత్తి, సరిగ్గా కలికాలానికి ఒకింతముందే గీతామృతాన్ని జనులకందించాడు. కాకపోతే కృతయుగంజోలికి ఎందుకుపోలేదు? త్రేతాయుగంలో దీనిమాట ఎందుకు ఊహించలేదు? ద్వాపరయుగం చివరిదాకా ఎందుకు వేచి ఉండాల్సి వచ్చింది? ఇది ఎట్లున్నాకూడా జనులకు కలిదోష భయంలేకుండా గీతామంత్రాన్ని జపించేలాగా మానవులకు భగవద్గీతని తన ముఖంనుండే వెలువరించాడు శ్రీకృష్ణుడు.

### గీతాజయంతిభాగ్యం

వ్యక్తులకువలె జయంతి జరుపుకొనగల్గే భాగ్యం గీతాగ్రంథానికి మాత్రమే కల్గింది. దాని వైశిష్ట్యంవల్లనే దానికి అట్టి అపూర్వగౌరవం సిద్ధించింది. శ్రీకృష్ణభగవానుడు పాండవులకు కౌరవులకు నడుమ జరుగుతున్న కురుక్షేత్రయుద్ధంలో అర్జునునకు గీతోపదేశం చేసిన సుదినం మార్గశిరశుద్ధ ఏకాదశి. కాబట్టి ఈ దినం మహాపర్వదినమైంది. ఈ రోజున గీతాగ్రంథానికేకాక శ్రీకృష్ణ, శ్రీవ్యాస, శ్రీఅర్జునులకు కూడా అర్చనలు గావించాలని పురాణాలవాక్కు.

### గీతాజయంతిరోజున ఆచరించదగ్గ కార్యక్రమాలేవంటే....

1) గీతను జనులందరూ కలిసి సమష్టిపారాయణం గావించడం.

2) గీతాతత్త్వమహిమ తెలిసిన మహనీయులచే గీతపై మహత్తర ఉపన్యాసాలనిప్పించడం.

3) పిన్నలకు, పెద్దలకు గీతాపోటీపరీక్షలను ఏర్పాటు గావించడం.

4) సామాన్యజనులకు గీతయందు ఆసక్తి కలిగేలా గీతాబుఱ్ఱ కథలు, గీతాహరికథలు మరియు ఇతర గీతాకాలక్షేపాలు ఏర్పాటు గావించడం.

5) గీతాసారం, గీతావిశేషాలు సంక్షేపంగా కరపత్రాల్లో ముద్రించి జనులకు పంచడం.

6) గీతాసంబంధ వివిధ వ్యాఖ్యలగ్రంథాలు, పద్యగద్యాల సంపుటాలు, గీతోపన్యాసరూపపుస్తకాలు, గీతాసంబంధిత చిత్రాలు, ఇంకనూ ఇతర గీతాసాహిత్యాన్ని జనుల సౌక ర్యార్థం ఒకేచోట ప్రదర్శించడం.

7) గీతాజయంతి మహాపుణ్యదివసం కాబట్టి ఈ రోజున శ్రీకృష్ణ పరమాత్మ, శ్రీవేదవ్యాసమహర్షి, శ్రీఅర్జునులవారి యొక్క చిత్రపటాలను పుష్పాలతో అలంకరించి, రథంపైగానీ, శకటంపైగానీ ఉంచి మేళతాళాలతో, భజనలతో పురవీథుల గుండా ఊరేగించడం.

8) ముఖ్యంగా గీతాజయంతిరోజునైనా, ఇకమీదటనుంచైనా ప్రతిదినము ఒక అధ్యాయమో, ఒకశ్లోకమో ఐనా పారా యణం గావించాలనే ప్రతినను చేపట్టడం.

పై విధంగా మనమందరము ఈ రోజునుండైనా భగవ ద్గీతాపారాయణానికి సిద్ధమై, ఆస్వామి కరుణాకటాక్షాలకు పాత్రులమౌదాం.

### భగవద్గీత ఎలా పుట్టిందంటే...

నారాయణుడు మొదట బ్రహ్మకు ఉపదేశించాడు. బ్రహ్మ దక్షుడికి ఉపదేశించాడు. దక్షుడు దానిని తన కూతురి కొడుకైన సూర్యునికి ఉపదేశించాడు. సూర్యుడు తన కుమారుడైన మనువుకు ఉపదేశించాడు. మనువు తన కొడుకైన ఇక్ష్వాకునికి ఉపదేశించాడు. ఆ తర్వాత అది కాల ప్రవాహంలో కలిసిపోయింది. నారాయణు డైన శ్రీకృష్ణుడు మరలా దానిని ధర్మక్షేత్ర మైన కురుక్షేత్రంలో అర్జునునకు ఉప దేశించాడు.

### గీత మానవుని దైనందినజీవితానికి.. ఎట్లుపయోగపడుతుందంటే...

దైనందిన ప్రజాజీవితంలో ఉపయోగపడని మన గ్రంథా లకు లోకంలో అంత విలువుండదు. కాని భగవద్గీత మాత్రం అట్టిది కాదు. మానవుడు తన నిత్యజీవితంలో అడుగడుగున ఎదుర్కొనే భౌతిక, నైతిక, ఆధ్యాత్మిక సమస్యలన్నింటికీ పరిష్కార మార్గం గీతయే చూపిస్తుంది. కాబట్టి అది మానవునికి జీవిత యాత్రయందు అతిప్రయోజనకరమైన గ్రంథమనడంలో ఏలాంటి సంశయంలేదు. కాబట్టి ఏరూపంగా గీత జనులకు సహాయ పడుతుందో తెలుసుకుందాం.

#### 1. కోపము వచ్చినపుడు

కోపమనేది ఒక మానసిక తరంగం. అది మొదట ఒక చిన్నగాలివలె పుడ్తుంది. సుడిగాలిలా మారిపోతుంది. పెను గాలిలా రూపొందుతుంది. అదే క్రమంగా తుపానుగాలిలామారి జీవుని అధోగతికి తోసేస్తుంది.

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి
*(అధ్యా. 2. శ్లో॥ 63)*






కష్టనష్టాలకు భయపడకూడదు - అవి అప్పడప్పుడూ ఎదురౌతుంటాయి

క్రోధంతో మానవులు తమను తాము మరచిపోతారు. సమ్మోహం పుడ్తుంది. దానివల్ల జ్ఞాపకశక్తి నశిస్తుంది. దాని ఫలితంగా వారు బుద్ధిని కోల్పోతారు. చివరికి అధోగతి పాలౌతారు అంటూ గీతయందు భగవానుడు మొట్టమొదట కోపంయొక్క దుష్ఫలితాల్నే హెచ్చరికగా అందరికీ తెలియ జేశాడు. కాబట్టి కోపం వచ్చినపుడు పై తెలిపిన గీతాశ్లోకాన్ని పఠించినట్లైతే ఆ దుష్టఅతిథి మన మనసునుండి (హృదయం నుండి) సమూలంగా వెలివేయబడుతుందనేదే పై గీతాశ్లోక పరమార్థం.

### 2. భోగసముదాయంపై ఆసక్తి జనించినపుడు

"భోగా భవమహారోగాః" అని వసిష్ఠులమాట. అనగా భోగాలు సంసారమహారోగాలని అర్థం. దీనిని గీతాచార్యుడైన శ్రీకృష్ణుడు "భోగా దుఃఖయోనయ ఏవతే" భోగాలు దుఃఖ హేతువులని తెలిపాడు. కాని ఎవరెన్ని చెప్పినా జనుల్లో అధిక సంఖ్యాకులు ఎండమావులవంటి ఆ విషయభోగాలపైకే ఉరుకు తుంటారు. కాని క్షణికావేశమైన సుఖం దానివల్ల కలిగినా వెను వెంటనే కొండంత దుఃఖం కాచుకొని ఉంటుందని గ్రహించక పోవడమే వారి మూర్ఖత్వం.

**శ్లో॥ యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ నతేషు రమతే బుధః**

*(అధ్యా.5. శ్లో॥22)*

సాధకులకు దృశ్యవిషయాలపై ఆశ కలిగినపుడు గీత యందలి పై భగవద్వాక్యాలను మరలమరల జ్ఞాపకానికి తెచ్చు కుంటూ వానినుండి చిత్తాన్ని మరల్చాలన్నదే పై గీతాశ్లోకపర మార్థం.

### 3. మరణభయము కలిగినపుడు

భయాలన్నింటిలోకి మరణభయం చాలా గొప్పది. పండితుడు, పామరుడు, ధనవంతుడు, దరిద్రుడు, బలవంతుడు, దుర్బలుడు, బ్రాహ్మణుడు, చండాలుడు, వెయ్యేల ప్రతివాడును మరణమనే మాట వింటే చాలు భయంతో కంపించిపోతాడు. అలా భయపడటం చాలా హాస్యాస్పదమైన విషయమని గీత యందు నిరూపింపబడినది.

మరణమంటే దేహవియోగం. తాను దేహమైతే దేహ వియోగానికి ఏడ్వటం సబబుగా ఉంటుంది. శిథిలవస్త్రాల్ని తొలగించేటపుడు ఎవ్వరూ దుఃఖించరు కదా! అలాగే దేహం కూడా ముసలిదై క్షీణించేటపుడు వివేకుల్లో ఎప్పటికి క్లేశ ముండదు. ఏలనగా ఆ దేహాదులకు సాక్షియగు అంతరాత్మయే తానని వారికి బాగుగ తెలుసుకాబట్టి.

**శ్లో॥ దేహినోస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా**
**తథా దేహాన్తర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి**

**(అధ్యా.2. శ్లో॥13)**

దేహే అని చెప్పబడినందువల్ల ఈ మార్పులు దేహానికే గాని ఆత్మకు కావని స్పష్టమౌతోంది. బాల్యం పోయి యౌవనం రాగానే ఎవరును దుఃఖించటంలేదు. యవ్వనం పోయి వార్ధక్యం వచ్చినపుడూ దుఃఖించటం లేదు. అలాంటప్పుడు వార్ధక్యంపోయి మరణం, దేహాంతరప్రాప్తి కల్గినపుడు ఏల దుఃఖిస్తున్నారని భగవానుని ప్రశ్న. మహనీయులకు ఈ రహస్యం తెలుసుకాబట్టే వారు మేరువువలె ధీరులై గంభీరంగా వర్తిస్తూంటారు. కావున జనులందరు కూడ ఈ సత్యాన్ని గ్రహించి ధీరులవలె ప్రవర్తించాలని ఉద్బోధించటమే పై గీతాశ్లోక పరమార్థం.

### దేహచక్రం



**4. కామాదివికారాలు ప్రకోపించినపుడు**

సాధకుల ప్రతీపశక్తుల్లో కామమే మొదటిది. అది ప్రతి పక్షనాయకుడు. జ్ఞానరత్నాన్ని దొంగిలించడానికి మొట్టమొదట సాధకుల మనసున ప్రవేశించి కన్నం వేసేది కామమే. అది చేరిన మరుక్షణమే దానిననుసరించి క్రోధ లోభాదులనే మిగతా పటాలమంతా కూడా చేరుకుంటాయి.

**శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః**
**(అధ్యా. 5. శ్లో॥ 23)**

శరీరంయొక్క వియోగానికి మునుపే కామ క్రోధాది దుర్గుణాలయొక్క వేగాన్ని ఎవరు అరికట్టగల్గుతారో వారే సుఖవంతులు, ముక్తులు. కాబట్టి కామముదయించగనే అది జీవితానికి గొప్ప అనర్థాన్ని తెచ్చిపెట్టే వస్తువని తెలుసుకోవాలి. మోక్షసుఖంనుండి జీవుని అధఃపాతాళానికి లాక్కుపోతుందని నిశ్చయించి హృదయంనుండి దూరంగా దానిని తరిమేయాలి. శత్రువు పక్కనే ఉన్నపుడు ఎంత హాని కలుగుతుందో కామమనే శత్రువువలన కూడా అంతే హాని జరుగుతుందని గ్రహించాలి. కాబట్టి దానికి ఆశ్రయమీయకూడదని (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే ఆరు దుర్గుణాలను అంతశ్శత్రువులుగా భావించి కామాన్ని త్యజించుమని గట్టి హెచ్చరికగా) భగవానుడు గీతయందు తెల్పడమే పై గీతాశ్లోక పరమార్థం.

**5. పరులపై అసూయ, ద్వేషము జనించినపుడు**

శత్రుమిత్రాదులందు, ఉదాసీనులయందు, ద్వేషించే వారియందు, బంధువులయందు, పుణ్యాత్ములయందు, పాపాత్ములయందు సమబుద్ధి కలవారే ఉత్తములు అని గీత ఘోషిస్తోంది.

**శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ**
**(అధ్యా. 12. శ్లో॥ 13)**

సృష్టిలోని ఏ ప్రాణులను ద్వేషించక, వారియెడల మైత్రి, కరుణ కల్గియున్నవారే నా భక్తులు అని శ్రీకృష్ణుడు ప్రకటించాడు. ఇంతేకాదు నీవలె ఇతరులను కూడా చూడు. ఇతరులను ద్వేషించిన తన్నుతాను ద్వేషించుకొన్నట్లే! ఇతరులను నిందిస్తే తన్నుతాను నిందించుకొన్నట్లే ఔతుంది. ఈ విశాలభావాన్ని మనసునందుంచుకొన్నట్లైతే ఇక అసూయాద్వేషాలే కాదు ఏ దుర్గుణాలూ మనవద్దకు రావు అనేదే పై గీతాశ్లోక పరమార్థం.

**6. ప్రాపంచికవైభవాలచే గర్వముదయించినపుడు**

ఈ అనంతకోటి బ్రహ్మాండములందు మనము నివసించే ఈ చిన్న భూగోళమందు ఏ మూలనో ఉన్న ఈ మనదేశమెక్కడ? ఈ దేశమందేకోణమందో దాగియున్న మన భూములు, రాజ్యాలు, వైభవాలు ఎక్కడ? పరమాత్మయనే అనంతమహా విభూతిని ఒక్కసారి మనసార స్మరించినట్లైతే గర్వం, అహంకారం పటాపంచలైపోతాయి.

**శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున**
**విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్**
**(అధ్యా. 10. శ్లో॥ 42)**

కాబట్టి గర్వాదులు కల్గినపుడు గీతయందలి పై శ్లోకాన్ని సంస్మరించి నాశకరపదార్థాల్ని గొప్పగా తలంచక, వానిచే గర్వాదుల్ని పొందక అక్షరుడైన (నాశంలేని) పరమాత్మనే ఆశ్రయించి ధన్యులు కావాలి. ఈ ప్రకారంగ ఆయా దుర్గుణాలు మనసున చేరినపుడు వెనువెంటనే వానికి విరుగుడైన ఆయా గీతాశ్లోకాల్ని జ్ఞప్తికి తెచ్చుకొని హృదయక్షేత్రాన్ని నిర్మలం కావించుకుందాం. ఇదియే గీతాబోధ లక్ష్యం.

భగవంతుని అద్వితీయునిగా భావించే అహింసాయుతులు, ఆత్మవేత్తలు, నిష్కామకర్ములు ఐనవారితో ఈ జగత్తు కనుక నిండియున్నట్లైతే కృతయుగం (స్వర్ణయుగం) దానంతటదే భూమిమీద అవతరిస్తుంది.

అందుకే మనమందరం భగవద్గీతను నిత్యమూ ఆచరిద్దాం. ఇలపై కృతయుగాన్నీ ప్రతిష్ఠిద్దాం. 

## భర్తృహరి సుభాషితం

**అడవిలో గానీ, యుద్ధంలో గానీ, శత్రువుల మధ్య గానీ, నీళ్ళలో గానీ, నిప్పులో గానీ, మహాసముద్రంలో గానీ, పర్వతశిఖరంపై గానీ, నిద్రిస్తున్నా, మత్తులో ఉన్నా, అపాయంలో ఉన్నా సరే మనుష్యుడు పురాకృత సుకృతాలు తప్పక రక్షిస్తాయి.**





# సుబ్రహ్మణ్యషష్ఠి- ఆధ్యాత్మిక ప్రతీక

- శ్రీ వెలుదండ నిత్యానందరావు

**కార్తికమాసంలో కుమారస్వామిని అర్చించటం ఆచారంగా వస్తోంది. కార్తికమాసమన్న పేరే కార్తికేయుని పూజించటానికి తగిన సమయమని సూచిస్తోంది. భారతీయులు కార్తికశుద్ధషష్ఠిని సుబ్రహ్మణ్యషష్ఠిగా కడుభక్తిశ్రద్ధలతో జరుపుకుంటారు. స్కందుడు, కుమారస్వామి, కార్తికేయుడు, సుబ్రహ్మణ్యస్వామి, షణ్ముఖుడు అని పలుపేర్లతో శివుని రెండవకుమారుని పిలుస్తారు. కుమారస్వామి మహత్తరమైనశక్తికి, దివ్యమైన జ్ఞానానికి ప్రతీక.**

### కుమారస్వామి పుట్టుక

తారకాసురాదిరాక్షసుల బాధలు పడలేక ఇంద్రాదిదేవతలు బ్రహ్మకు మొరపెట్టుకున్నారు. బ్రహ్మ ఆలోచించి పార్వతీపరమేశ్వరులకు ఉదయించే పుత్రుడే వాణ్ణి చంపటానికి సమర్థుడు. ఆ సమయ మాసన్నమౌతుంది. మీరు నిశ్చింతగా ఉండండన్నాడు.

ఒకరోజున శివపార్వతుల సమాగమవేళ అగ్ని వచ్చాడు. కేళీవిహారవిఘ్నానికి శివుడు మహోగ్రకోపంతో తన వీర్యాన్ని భరించాల్సిందిగా అగ్నిని ఆజ్ఞాపించాడు. అగ్ని దాని వేడిమిని భరించలేక గంగకిచ్చాడు. గంగాప్రవాహంలో ఆ శివతేజస్సు కొట్టుకొచ్చి రెల్లు పొదలవద్ద ఆగిపోయి కుమారస్వామిగా వ్యక్తిత్వం పొందింది. అప్పుడు సప్తర్షుల భార్యల్లో అరుంధతితప్ప తక్కిన ఆరుమంది కృత్తికలు ఆ బాలునికి తల్లులై స్తన్యమిచ్చి పోషించారు. అలా పెరిగి పెద్దవాడై కుమారస్వామి దేవసేనను, వల్లిని పెళ్ళాడి, తారకాసురాది రాక్షసులను సంహరించాడు. ఇదీ కథ!

### కుమారస్వామిజననం సృష్టిపరిణామవికాసక్రమం

కానీ, ఇది వివిధాధ్యాత్మికవిషయాలకు ప్రతీకగా ఉంది. కుమారస్వామి జననం సృష్టిపరిణామవికాసంలోని క్రమాన్ని తెలుపుతోందనిపిస్తుంది.

శివుడు చిదంబరుడు. ఆకాశతత్త్వానికి సంకేతం. వ్యోమమును (ఆకాశాన్ని) కేశములు(జుట్టు)గా గలవాడు. కనుకనే శివునికి వ్యోమకేశుడని పేరు. పార్వతీదేవి వాయువునకు ప్రతీక. లలితాసహస్రనామంలో ప్రాణదా-ప్రాణరూపిణి- ప్రాణేశ్వరి-ప్రాణ ధాత్రీ అని చెప్పబడింది. మనలోని ప్రాణము వాయుస్వరూపం. కామం అగ్నిస్వరూపం. శివపార్వతులమధ్య అగ్ని వచ్చాడు అంటే ఆదిదంపతులమధ్య కామాగ్ని ప్రజ్వరిల్లింది అని భావం. ఆ విధంగా వారిమనస్సులో పుట్టిన కామాగ్ని వల్ల వెలువడ్డ శివతేజస్సును భరించలేక గంగకు సమర్పించాడు. ఆ తేజస్సు గంగా(జలం)స్వరూపమని భావించాలి. శివతేజస్సు గంగాప్రవాహంలో కొట్టుకుంటూ వచ్చి రెల్లుగడ్డి వద్ద ఆగిపోయింది. రెల్లుగడ్డి పృథ్వీతత్త్వానికి చిహ్నం. అక్కడ దేహనిర్మాణం జరిగి కుమారస్వామిగా వ్యక్తిత్వం పొందాడు.

**(నవంబరు, 24 సుబ్రహ్మణ్యషష్ఠి సందర్భంగా..)**



### శరవణమంటే...

ఈ విధంగా పంచభూతాలేర్పడి జీవనిర్మాణం జరిగిన విధం వివరింపబడింది. శివుడు (ఆకాశం), పార్వతి (వాయువు) లకు కలిగిన కామం(అగ్ని) వలన వీర్యం (ఆపస్) ఘనీభవించి శరవణం (పృథ్వీగోళాలు) ఏర్పడ్డాయి. ఈ భావనకు ఉపబలకంగా ఈ క్రింది విషయం చెప్పవచ్చు.

ఈ విధంగా ఆకాశంనుండి వాయువు-వాయువునుండి అగ్ని-అగ్నినుండి జలం-జలంనుండి పృథ్వి ఏర్పడిందని కుమారస్వామి జన్మరూపకంగా చెప్పబడింది. పృథ్వి అంటే ఇక్కడ కేవలం భూగోళంమీది మట్టికాదు. అన్ని గోళాలయొక్క భౌతికపదార్థం అని భావం. ఆ విధంగా నిర్మాణమైన జీవము వికాసం చెంది అభివృద్ధి చెందాలంటే దానికి 'పోషణ' జరగాలి గదా! కుమారస్వామికి కృత్తికలు స్తన్యమిచ్చి పోషించాయి. భూగోళంలోని జీవులు ఆత్మవికాసం చెందాలంటే కేవలం సూర్య చంద్రులనుండి వెలువడే కిరణాలేగాక సప్తర్షిమండలంనుండి వెలువడే కిరణాలు కూడా తోడ్పడతాయి. వీనిప్రభావం భూమి మీద పుట్టే జీవరాసుల్లోని జ్ఞానవికాసంగా ప్రస్ఫుటమౌతుంది. ఈ విధంగా అరుంధతి తప్ప తక్కిన కృత్తికానక్షత్రాల కిరణ ప్రసాదం భూమిమీద పడడాన్నే కృత్తికలు ఇచ్చిన పాలుగా చెప్పబడింది. ఈ విధంగా కిరణాలవెలుగుల్లో పుట్టి పెరుగుతున్న జీవుడే కార్తికేయుడుగా వర్ణింపబడ్డాడు. భూమిలోని సారాన్ని గ్రహించి కుమారస్వామి (జీవప్రకృతి) పెరిగాడు. అలా ఆరుమంది తల్లులవటంతో షాణ్మాత్రుడయ్యాడు.

ఈ ప్రకృతికి అంతంలేదుగదా! అది ఎంత పెరిగినా ఇంకా ఉండనే ఉంటుంది. దానికి వార్ధక్యం లేదు. ఒక పరిధిని మించి ప్రకృతి పెరగదు. కనుక దానిని సూచించటానికే 'కుమారస్వామి' అన్న పేరు సార్థకమైంది.

### షణ్ముఖపరమార్థం

ప్రతిగోళానికి నాలుగుదిక్కులు. ఊర్ధ్వ అధోభాగాలుంటాయి. ఇవి కుమారస్వామిని 'షణ్ముఖుడు'గా సంకేతించాయి. జీవుడు పంచేంద్రియాలు, మనస్సు కల్గి ఉండడాన్నే 'షణ్ముఖు'డని ప్రతీకాత్మకంగా చెప్పారని కూడ చెప్పొచ్చు. దీనినే మరోతీరుగా కూడా సమన్వయించుకోవచ్చు. అతని షణ్ముఖములు; కాల విభాగ సూచితములు. ఎందుకంటే కాలపరిగణనంలోని ముఖ్యమైన కొలత సంవత్సరం. ఆ సంవత్సరాన్ని ఆరుఋతువులుగా విభాగించి కొలుస్తారు.

### ధార్మికశక్తిమహత్త్వం

ప్రతి బ్రహ్మాండగోళంనుండి శుద్ధమైన బ్రహ్మజ్ఞానం అభివ్యక్తమౌతుంది. కనుకనే సుబ్రహ్మణ్యస్వామి అయ్యాడు. అతని చేతిలోని ఆయుధం పేరు 'శక్తి'. ఇది బ్రహ్మజ్ఞానంవల్ల పుట్టే మహాశక్తికి ప్రతీక. జ్ఞానంతో మానవుడు తనలోని అసురీ శక్తులను లయం చేసుకోవాలి. కుమారస్వామిచేత హతమైన శూర-పద్మ, సింహ-ముఖాసుర మరియు తారకాసురులు అనే రాక్షసులు అరిషడ్వర్గాలైన కామక్రోధలోభమోహమదమాత్సర్యాలకు ప్రతీకలు. కుమారస్వామి వారిని చంపాడంటే కేవలం ధార్మికశక్తివల్లనే అసురీశక్తులు హతమారి తీరుతాయని చెప్పడానికే.

### వల్లీదేవసేనశక్తిమార్మికత

కుమారస్వామికి దేవసేన మరియు వల్లి అని ఇరువురు భార్యలు. వారు ఇచ్ఛాశక్తికి, జ్ఞానశక్తికి చిహ్నాలుగా చెప్పుకొన్నట్లే దేవసేనను 'సాత్త్వికత'కు, వల్లి (లత-అల్లుకొని ప్రాకునది)ని కుండలినీశక్తికి ప్రతీకగా చెప్పుకోవచ్చు. కుండలిని సుషుమ్నానాడి ద్వారా వెన్నెముకనుండి ఊర్ధ్వముఖంగా ప్రవహిస్తుంది గదా! మహాయోగులకు మాత్రమే ఈ కుండలిని సాహస్రారం చేరడం అనుభవమైన విషయం.

### నెమలి అంతరార్థం

కుమారస్వామి మయూరవాహనుడు. నెమలి ప్రణవానికి ప్రతీక. ప్రణవాన్ని అధిష్ఠించినవాడు కనుక స్కందుడు ఓంకారస్వరూపుడు. తండ్రి అయిన శివునకే ఒక పర్యాయం కుమారస్వామి ప్రణవంయొక్క అంతరార్థాలను బోధించినట్లుగా పురాణాలవాక్కు.

### కోడిధ్వజం

కార్తికేయుని ధ్వజచిహ్నం కుక్కుటం. కోడికూతను ప్రణవశబ్దానికి ప్రతీకగా అన్వయించుకున్నట్లే, కోడిగుర్తుగల ధ్వజాన్ని జ్ఞానసూర్యోదయానికి గుర్తుగా కూడ సమన్వయించుకోవచ్చు.





# జేజేలివియే చేకొనుమయ్యా!

– "దుర్గాచరణ్"

శ్రీసుబ్రహ్మణ్యేశ్వరా! శ్రితజనమందారా!
జేజేలివియేచేకొనుమయ్యా! కార్తికేయా!
మావెతలనుబాపి, మముచల్లగబ్రోచే
చక్కనిస్వామీ! మురుగా! చల్లని తండ్రీ షణ్ముగా!

సర్వపాపఘ్నా! సాధురక్షనిమగ్నా!
దుష్టకార్యభగ్నా! ద్రోహచింతవిఘ్నా!
బర్హివాహనా! కుక్కుటకేతనా!
దేవాసురదేవసేనానీ! శూలపాణీ!

తారకాసురసంహారార్థం
కారణజన్ముడుగా వెలసిన
గౌరీశంకరవీరకుమారా!
తారకాది మహాదైత్యసంహారా!

హేరంబ, మణికంఠలభ్రాతా!
ఇంద్రోపేంద్ర జామాతా!
దనుజవిజేతా! వరవృష్టిజీమూతా!
పరమేశ్వర మహావీర్యసంజాతా!
సుజ్ఞాననిధానవిశాఖా!
ప్రజ్ఞాధురీణవివేకా!

దుష్టశక్తులనాశం చేసి,
శిష్టజనాళిని సముద్ధరించగా
పళని, పళముదిర్‌చోళై,
తిరుత్తణి, తిరుకలుకుండ్రం,



తిరుచందూరు, స్వామిమలై,
ఆరుక్షేత్రముల, ఆరువిధముల,
దేవసేన, శ్రీవల్లీ నీ దేవేరులుగా
వెలసిన దేవా! వేలాయుధా, రావా?
మముబ్రోవ, నీవువినా, అన్యథా శరణం నాస్తి,
దీనశరణ్యా, సుబ్రహ్మణ్యా!
ప్రణవబోధకగురువరేణ్యా!
నాగస్వరూపా! సుబ్బారాయా!
స్వామినాథా! గుహా! స్కందా!
నమో నమో నమో నమః

*॥ ఓమ్‌సౌంశరవణభవ! ॥*

### 'గుహుడు' పరమార్థం

కార్తికేయుని మరొక ప్రసిద్ధనామం 'గుహుడు'. జీవుని హృదయకుహరంలో వెలుగు అంతస్సాక్షిరూపమైన భగవంతునికి సూచన.

స్కందనామం శివునినుండి కుమారస్వామి ఆవిర్భావాన్ని సూచిస్తున్నా, శుద్ధమైన బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదించేవాడనే అర్థం స్ఫురిస్తుంది.

### కవాడి అంటే...

స్కందషష్ఠి ఆంధ్రులకన్న తమిళనాడులో బాగా జరుపుకుంటారు. అక్కడ భక్తులు దేవాలయాది పుణ్యస్థలాల్లో నెమలి ఈకలతోను, వెదురుదబ్బలతోను 'కవాడి'ని నిర్మిస్తారు. ఇది తమిళపదం. 'కవాడి' అంటే 'నీ పాదముల మ్రోల నన్ను రక్షించు' అని భావం. ఈ 'కవాడి'ని ఇంకో తీరుగా వ్యాఖ్యానించాలంటే దేవుని పాదాలచెంత అహంకారాన్ని విసర్జించి జీవుడు శరణాగతి పొందాలన్నదే దీని భావం.



బాలప్రబోధం

# ఇదీ ఓ యాగమేనా?

- శ్రీ అవసరాల లక్ష్మీపతిరావు

భారతయుద్ధం పరిసమాప్తమైంది. ధర్మరాజు రాజయ్యాడు. జరిగిన విషాదం ఆతనిగుండెల్లో గూడు కట్టుకుంది. అంతకూ కారణం తానేనని కుమిలిపోయాడు. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదని బాధపడ్డాడు. కృష్ణుడు ధర్మజునికి సర్ది చెప్పాడు. నీవుగాని, దుర్యోధనుడుగాని ఎవ్వరూ కురుక్షేత్ర యుద్ధానికి కారణం కాదు. కర్మఫలంవల్ల అలా జరిగింది. జరిగినదానికి విచారించి ప్రయోజనం లేదు. అశ్వమేథయాగం చెయ్యమని కృష్ణుడు ధర్మజుని ప్రోత్సహించాడు.

చైత్రపూర్ణిమనాడు పాండవులు యాగదీక్ష ప్రారంభించారు. వ్యాసుడు, పైలుడు, యాజ్ఞవల్క్యుడు మొదలగు ఋషులు ఋత్విక్కులుగా వ్యవహరించారు. భీమ నకులులు రాజ్యపాలనా కార్యక్రమానికి నియమితులయ్యారు. సహదేవుడు కుటుంబ బాధ్యత వహించాడు. అర్జునుడు గాండీవం ధరించి సైన్యంతో యాగాశ్వం వెంట బయలుదేరాడు.

అలా.... అశ్వం దేశమంతా సంచరించి హస్తినాపురం చేరింది. అశ్వం తిరిగి వచ్చిన మూడవరోజు వ్యాసభగవానుని పర్యవేక్షణలో అశ్వమేథయాగం ప్రారంభమయ్యింది. వేరు వేరు చెట్ల కఱ్ఱలతో మూడువందల యూపస్తంభాలు నిలబెట్టారు. భీమసేనుడు ఆహ్వానితులకు తగిన ఏర్పాట్లు చేశాడు. అన్నపు రాశులు గుట్టలుగుట్టలుగా పోగులు పెట్టారు. పెరుగుకాలువలు, నేతిమడుగులు ప్రవహిస్తున్నాయి. లక్షలమంది భోజనం చెయ్యగానే దుందుభి మ్రోగేది. అలా దుందుభి నిర్విరామంగా మోగుతూనే ఉంది.



అశ్వమేథయాగంలో చేసిన అపూర్వ అన్నదానం, ఘనకార్యాలను గురించి అందరూ ముచ్చటించుకుంటున్నారు. అప్పుడు ఒక ముంగీస అక్కడికొచ్చింది. సక్తుప్రస్థుని యాగశాలలో పొర్లడంవల్ల నా శరీరం సగం బంగారంగా మారింది. ఎన్నో యాగాలు చూశాను. ధర్మరాజు యాగశాలలో కూడా పొర్లాను. కానీ, నా మిగిలిన సగం శరీరం బంగారం కాలేదు. ఇదీ ఒక యజ్ఞమా? సక్తుప్రస్థుని యజ్ఞానికి ఇది సరితూగదని యజ్ఞాన్ని చిన్నబుచ్చుతూ మాట్లాడింది.

### సక్తుప్రస్థుడి కథ

కురుక్షేత్రంలో ఒక విప్రుడు, ఆతని భార్య, కొడుకు, కోడలు ఉంఛవృత్తిలో జీవించేవారు. ఒకసారి భయంకరమైన అనావృష్టి ఏర్పడింది. చాలాకాలం తర్వాత వారు ఏరుకు వచ్చిన ధాన్యంతో పేలాపిండి తయారుచేశారు. 'సక్తు' అంటే పేలాపిండి. 'ప్రస్థ' అంటే కుంచెడు అని అర్థం. కనుక ఆ బ్రాహ్మణుడికి సక్తుప్రస్థుడని పేరొచ్చింది. ఆ పేలాపిండిని నాలుగుభాగాలుగా చేసి ఆ నలుగురూ పంచుకున్నారు.

ఆ సమయంలో వారింటికి ఒక అతిథి వచ్చాడు. 'అతిథిదేవోభవ' అని పూజించి, తన వంతు పేలాపిండిని ఆహారంగా ఆ బ్రాహ్మణుడు సమర్పించాడు. ఆ పేలాపిండితో అతని ఆకలి తీరలేదు. తన భార్య వంతు పిండి కూడా ఇచ్చింది. తన కొడుకు, కోడలు కూడా వారి వారి వాటా పేలాపిండిని అతిథికి ఆహారంగా ఇచ్చారు. భక్తితో నమస్కరించారు. ధర్మార్జితమైన కొంచమైనా పాత్రోచితదానం చేయడం ఉత్తమధర్మం. దానికి మించిన ధర్మం లేదు. ఆ వచ్చిన అతిథి ధర్ముడు, వారందరిని బ్రహ్మలోకానికి తీసుకుపోయాడు.

వారెళ్లిన తర్వాత బిలంనుండి ముంగీస బయటకొచ్చి సక్తుప్రస్థుడు దానం చేసిన చోట పొర్లింది. శరీరం సగం మేర బంగారమయింది. ధర్మరాజు యాగం చేస్తున్నాడన్న గంపెడాశతో మిగిలినభాగం శరీరం బంగారం చేసుకుందామని వచ్చింది. కాని ముంగీస ఆశ ఫలించలేదు. అందుకని సక్తుప్రస్థుని యాగానికి ఈ యాగం సరితూగదని విమర్శించింది. హింసతో కూడుకున్న యాగంకంటే అహింసాయుతమైన సక్తుప్రస్థుని తపోయాగమే గొప్పదని ఈ కథ నిరూపించింది. 

యువవాణి

# ప్రార్థన పరమార్థం

- శ్రీ ఎం.సూర్యప్రసాదరావు

ఈ ప్రాపంచిక జీవనవిధానంలో కావాలని అడగనిదే ఏ వస్తువూ మన దరికి రాదు. అడగనిదే అమ్మ ఆయినా అన్నం పెట్టదు. ఈ విధంగా అడగడం అనే పదాన్ని 'ప్రార్థన' అని చెప్పుకోవచ్చు. తెలియనివాడిని సహాయమడిగితే అది 'బిచ్చం' ఔతుంది. తెలిసినవాడిని సహాయమడిగితే అది 'విన్నపం' ఔతుంది. దేవుడిని సహాయమడిగితే అది 'ప్రార్థన' ఔతుంది. ప్రార్థనద్వారా భగవత్తత్త్వానికి మనం ప్రేమపాత్రులమౌతాం. అందుకు భక్తివిశ్వాసాలు కావాలి. శ్రద్ధాసక్తులు కావాలి.

### ప్రార్థన ఎలా చేయాలి?

ఓ భగవంతుడా! నీవే తల్లివి. నీవే తండ్రివి. నీవే సదాచారాలను ఉపదేశించే ఆచార్యుడవు. నీవే సద్బుద్ధిని ప్రసాదించేవాడవు. మేము లోకకల్యాణానికి సహకరించాలి. మాలోని మూఢత్వాన్ని పారద్రోలాలి. జ్ఞానామృతాన్ని ఇతరులకు పంచిపెట్టాలి. అందులో ప్రకాశవంతమైన మార్గంలో మమ్మల్ని నడిపించు. మాలో చైతన్యం కలిగించు. మాలో జాగృతిని ఆవాహన చేయించు!



### ఏడురకాల ప్రార్థనలు

మంచిపనులు చేస్తూ నూరేళ్ళజీవితాన్ని, ఆరోగ్యవంత మైన ఆయుష్షునూ ప్రసాదించుమని కోరడం మొదటిప్రార్థన. వాణి మంచి వాక్కులను మాత్రమే పలకాలి. నేత్రాలు మంచి దృశ్యాలు మాత్రమే చూడాలి, చెవులు మంగళప్రదమైన, మంజులప్రదమైన వేదనాదాన్ని మాత్రమే వినాలి, జీవించినంత కాలం కర, చరణాలు, ఇతర శరీర అవయవాలు సంపూర్ణ ఆధీనంలో ఉంచే 'ఆయువు"ను ప్రసాదించుమని అర్థించటం.

పంచప్రాణాలు, పంచ ఉపప్రాణాలు దృఢంగా ఉండేలా అనుగ్రహించుమని కోరే కోరికే రెండవప్రార్థన. ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అనేవి ఐదుప్రాణాలు. నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయ అనేవి ఐదు ఉపప్రాణాలు.

అనుకూలమైన వైవాహికజీవితంలో చక్కని సంతానాన్ని ప్రసాదించుమని మూడోప్రార్థన. సంస్కారవంతమైన, అనుకూల మైనవంశానికి పేరు తెచ్చిపెట్టి నలుగురూ మెచ్చుకునే సంతానమే సత్సంతానమౌతుంది.

పాడి పంటలతో దేశం సుభిక్షంగా ఉండాలంటే 'పశు సంపద" బాగా ఉండాలి. అప్పుడే కుటుంబం, సమాజం ఆనందంగా, సంతోషంగా మనగలుగుతాయి. దేశజనాభా ఆనందానికి నిదర్శనం పశుసంపద. అటువంటి పశుసంపదను ప్రసాదించుమని కోరడం నాల్గవప్రార్థన.

కీర్తిని ప్రసాదించుమని కోరుకోవడం ఐదవప్రార్థన. విశేషమైన మంచిపనులు చేస్తూ ఉండాలి. ఫలాపేక్ష లేని కర్తవ్య కర్మలను నిర్వహిస్తుండాలి. వీనిని సక్రమంగా సాధించే కీర్తిని కోరడం సుజనుల లక్షణం! సత్కీర్తిని మాత్రమే అర్థించేలా తనను అనుగ్రహించుమని కోరడం ఒక విశేషం.

సన్మార్గంలోనే ధనాన్ని ఆర్జించడాన్ని 'ద్రవిణం' అని నిర్వచిస్తారు. ఇది సమకూరాలని కోరడం ఆరవప్రార్థన, తన సంపాదన అక్రమార్జనకారాదు. న్యాయబద్ధమైన, నీతినియమాల ననుసరించి అర్థించిన సంపాదనవల్ల సంతానానికి కూడా సద్బుద్ధి కలుగుతుంది.

బ్రహ్మవర్చస్సును ప్రసాదించుమని కోరడం ఏడవ ప్రార్థన. జ్ఞానంతో కూడిన తపస్సు బ్రహ్మవర్చస్సు అని పిలువ

బడుతుంది. ముఖంలో ప్రసన్నత, చదువుచేత, సంస్కారంచేత అలవరచుకొన్న జ్ఞానం శుభలక్షణాలతోచేరి ముఖంలో బ్రహ్మ వర్చస్సును ఆవిష్కరింపచేస్తుంది. ఈ దివ్యమైన సప్తవరాలను నాకొరకు అనుగ్రహించు!

### మూడురకాల భక్తులు

ప్రార్థించి కోరుకునే కోరికలను బట్టి భక్తులను మూడు విధాలుగా విభజించవచ్చునని విజ్ఞులు చెబుతారు. తమ దురదృష్టానికి భగవంతుని నిందిస్తూ తమ కష్టాలను తొలగించు మని ప్రార్థించేవారు సాధారణభక్తులు. సణక్కుండా తమ కష్టాలను భరించి, వానిని ఎదుర్కొనేందుకు సరియైనబలాన్ని ఇవ్వుమని ప్రార్థించేవారు మధ్యరకంభక్తులు. కష్టమైనా, సుఖ మైనా, మంచియైనా, చెడుయైనా ఏం జరిగినా మంచికోసమే అన్న నమ్మకాన్ని కలిగించుమని కోరేవారే నిజమైన భక్తులు.

### భగవద్గీతలో ఏముందంటే...

ప్రార్థించేవారు, వారు ప్రార్థించేవిధానం నాల్గురకాలుగా ఉంటాయి. వారు ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసులు, జ్ఞానులు అను నాలుగువిధాలుగా ఉంటారని కృష్ణభగవానుడు భగవద్గీతలో చెప్పాడు.

శారీరక, మానసిక సంతాపములకు గురియై భగవం తుని ప్రార్థించేవారు 'ఆర్తులు' అనబడతారు. శుభాశుభకర్మ లను ఆచరించువారు, సుఖసంపదలను కోరుకునేవారు అర్థార్థు లని పిలువబడుతారు. ఐహికవిషయాలపై ఆసక్తిని వీడి పర మాత్మ తత్త్వజ్ఞానాన్ని పొందగోరేవారు 'జిజ్ఞాసులు' అని నిర్వ చించబడతారు. పరమాత్మప్రాప్తిని ఆశించేవారు జ్ఞానులౌతారు.

నిత్యజీవితంలో మనం చేసే పొరపాట్లవల్ల ఎదుర్కొనే అపజయాలకు మూడు ప్రధానకారణాలు చెప్పుకోవచ్చు. అవ గాహన లేకుండా పని చేయడం, లక్ష్యం లేకుండా ఉదా సీనతతో వ్యవహరించడం. దృఢసంకల్పం లేకుండా కార్యాన్ని కొనసాగించడం.

మనకు ఆధారాన్ని జీవనాధారాన్ని ప్రసాదించే ఈ భూమి తల్లిలాంటిది. దైవసంభూతం.

మనకు చోటునిచ్చే సువిశాలమైన భూమి నిత్యం పచ్చగా, దృఢంగా కనులవిందుగా కనిపించాలి. ఉత్కృష్టమైన సత్యం, నీతినిజాయితీ భూమిని భరిస్తున్నాయి. తపస్సు, యజ్ఞాలద్వారా ఉత్పన్నమైన శక్తి భూమిని భరిస్తున్నాయి. గడిచిపోయినకాలానికి, గడుస్తున్నకాలానికి, రాబోయేకాలానికి మహానాయకురాలు భూదేవి మాత్రమే. ఆమెకు ఆనందకరమైన జీవనాన్ని ప్రసాదించుమని ప్రార్థించాలి.

కష్టమంటే ఏమిటో, అది ఎలా సిద్ధిస్తుందో, దానిని ఎలా తొలగించుకోవచ్చో కపిలమహర్షి సాంఖ్యదర్శనంలో వివ రించాడు. కష్టాలు మనం నిర్మించుకున్నవే! మనసులో నిర్మించు కున్న ఆలోచనలు కష్టాల రూపురేఖలు నిర్మిస్తాయి. మనం నిర్మించుకున్న సమస్యలు కష్టాలను నిర్దేశిస్తాయి. మనసులో నిర్మాణమైన సృష్టినే ప్రత్యక్షంగా ప్రపంచంలో చూస్తున్నామని కపిలమహర్షిమాట.

భగవన్నామస్మరణంవల్ల మననం జరుగుతుంది. మననంవల్ల విధి, ధ్యాసలు ఉద్దీప్తం చెందుతాయి. ఫలితంగా జ్ఞాననిష్ఠ పెరుగుతుంది. అప్పుడు మనసు మలినరాహిత్యం చెందుతుంది. జీవభావన క్రమంగా అంతర్ధానమౌతుంది. స్వయంప్రకాశమైన ఆత్మ మిగులుతుంది. మూసలో కరిగించిన బంగారం శుద్ధి పొందినట్లు జ్ఞానాగ్ని మనసును శుద్ధి చేస్తుం దని శంకరాచార్యులవారి మాట.

భగవంతుని ప్రార్థించేటప్పుడు ఏమని కోరుకోవాలని కొందరంటే, అసలేమీ కోరుకోకూడదని నిష్కామంగా ప్రార్థించా లని కొందరు సమాధానం చెబుతారు. అది ఆదర్శవంతమైన సమాధానమనిపించినా, సర్వసమర్థుడైన భగవంతునిగాక మరె వ్వరిని అడగాలని మరికొందరు ప్రశ్నిస్తారు.

అందుకే ప్రార్థన చేయడం సక్రమమే. కానీ ప్రార్థించి ఏదో ఒకటి కోరుకుంటే అది లభిస్తే అది దైవదత్తమని, దైవ ప్రసాదమని భావించవచ్చు! అలా లభించిన వస్తువుపై భగవ న్ముద్ర ఏర్పడడంవల్ల ఆ వస్తువినియోగంతో మనస్సు పరి శుద్ధమౌతుంది. ఆ కోరిక తీరిన తరువాత మరే కోరికా కోరుకో నవసరంలేని పరిపూర్ణతాభావం కలుగుతుంది! ఫలితంగా ఏ కోరికా లేని స్థితికి వెళ్ళిపోతాం. దానినే నిష్కామస్థితి అని పిలుస్తారు. క్రమంగా సకామభక్తి నిష్కామభక్తిగా మారి పోతుంది.

సుఖంకోసం వెంపర్లాడడం కంటే ఉన్న ఆనందాన్ని గుర్తించగలిగే వివేకాన్ని ప్రసాదించుమని కోరుకోవాలి! ఆ స్థితి మనలను నిత్యానందులుగా మారుస్తుంది. మనచుట్టూ విస్తరించి ఉన్న ఆనందాన్ని గుర్తించగలిగే దృష్టిని ఇవ్వమనడమే ప్రార్థన పరమార్థం. 





ధైర్యం, కాలం, ప్రకృతి ఈ మూడునూ ఉత్తమమైన గొప్పవైద్యులు

బాలవాక్కు

# నిర్మలభక్తి

- మాస్టర్ కె.ఎస్.ఎస్.సచిన్

చోళరాజ్యాన్ని పాలించే రాజు విష్ణుభక్తుడు. అతడు విష్ణువును అమితభక్తితో మణిమాణిక్యాలతో పూజించేవాడు. ఆ తర్వాత ఒక పేదబ్రాహ్మణుడొచ్చి, వాటినంతా తొలగించి, తులసిదళాలతో భక్తిగా పూజించేవాడు. తనకున్న దినుసులతో ప్రసాదం చేసి నైవేద్యం కూడా పెట్టేవాడు.

ప్రతిరోజూ తానొచ్చే సమయానికి మణిరత్నాలన్నీ ప్రక్కకు తోసేసి తులసిదళాలతో అలంకరించబడి ఉండేవి. ఇలా ఎవరు చేస్తున్నారో చూడాలని విగ్రహం వెనుక నక్కి ఉన్నాడు రాజు.

కొంతసేపటి తర్వాత బక్కచిక్కినవాడూ, సరియైన అంగవస్త్రంకూడా లేని ఒక పేదబ్రాహ్మణుడొచ్చి ఆ మణుల రాశుల్ని ఎడమచేతితో ప్రక్కకు తోసేసి, తాను తెచ్చిన తులసి దళాలను స్వామికి అలంకరించడం చూసి బ్రాహ్మణుని ఎదురుగా వచ్చి, కోపంతో "మూర్ఖుడా! నే పూజించిన మణులను, రత్నాలను ప్రక్కకు త్రోసి, తులసిఆకులతో స్వామిని పూజిస్తున్నావే?" అంటూ గద్దించాడు.

దానికి ఆ బ్రాహ్మణుడు - 'ప్రభూ! భక్తి అన్నది ఎవరికైనా ఒక్కటే! ఎవరికిగల శక్తికొద్దీ వారు పూజిస్తారు. నా శక్తి ఈ తులసిదళాలు మాత్రమే!' అని వినయంగా సమాధాన మిచ్చాడు.



దానికి ఆ రాజు "సరే! ఐతే ఆ విష్ణువు మణిమాణిక్యాలతో పూజించే నన్ను స్వర్గానికి తీసికెళతాడో, ఆకులలములతో పూజించే నిన్ను స్వర్గానికి తీసికెళతాడో చూద్దాం!" అని అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

మర్నాటినుండి మహారాజు మరింత విలువైన వజ్ర వైడూర్యాలతో విష్ణువుని పూజించడమే కాక, రాజ్యంలోని



మాస్టర్ కె.ఎస్.ఎస్.సచిన్,
9వతరగతి,
ఆదర్శ హైస్కూల్,
గంగరాజునగర్,
కాకినాడ-533 005.

ప్రజలందరికీ అన్నదానం, వస్త్రదానం, భూదానం మొదలైన అనేక దానధర్మాలు కూడా చెయ్యడం మొదలుపెట్టాడు.

పేదబ్రాహ్మణుడు ప్రతిరోజూ గుడిలో ఒక విచిత్రం జరగడం గమనించాడు. అతడు నైవేద్యంకోసం తయారు చేసిన ప్రసాదం, దేవునికి అర్పించకుండానే, గిన్నెలో ప్రసాదం ఖాళీ అయిపోయేది. ఎవరు దొంగలించి తింటున్నారో ఆ దొంగ ఎవరో పట్టుకోవాలని నిశ్చయించుకొని, గుడిలో దాగి ఉన్నాడు.

కొంతసేపటికి ఒక బక్కచిక్కిన, ఎముకలపోగులా ఉన్నతను వచ్చి, స్వామిముందుంచిన ప్రసాదాన్ని ఆతృతతో తినడం గమనించాడు. అతడి ఆకలి గమనించిన బ్రాహ్మణుడు ఆ బక్కవానితో, "నాయనా! భయపడకుండా తిను. ఇంత తక్కువ ప్రసాదంతో నీ ఆకలి తీరదుగానీ, మరింత పెడదామన్నా నా ఇంట ఈ రోజు వండడానికి మరేమీ లేవే" అని బాధపడ్డాడు.

అంతే ఆ బీదవాడు విష్ణుమూర్తిగా ప్రత్యక్షమై తన పుష్పకవిమానంపైకెక్కించుకున్నాడు. ఆ వింత చూచి మహారాజు. దేవుని పూజించడానికి హడావుడి, ఆర్భాటాలూ కావనీ నిర్మలభక్తితోనే అది సాధ్యమౌతుందనీ తెలుసుకున్నాడు.






# నా భాగ్యమే.. మహద్భాగ్యము!!

- శ్రీ జె.సుబ్రహ్మణ్యం

నాది చిత్తూరుజిల్లాలోని పలమనేరుపట్టణం. నా స్నేహితుడితో కలిసి అనేకసార్లు తిరుమల శ్రీవారిని దర్శించుకున్నాను. అదేవిధంగా, 2003వ సంవత్సరంలో కూడా ఆయనతో నేను, నా భార్య, దర్శనానికెళ్లాం. ఆ రోజు మధ్యాహ్నం సుమారు 3-4 గంటల మధ్యకాలంలో శ్రీవారి పాదపద్మాలను దర్శించిన తర్వాత మేము శ్రీవారిహుండీలో భక్తి పూర్వకంగా కానుకలు సమర్పించడానికి క్యూలో వస్తున్నాం. మేము స్వామివారికి కానుకలు సమర్పించిన వెంటనే, మాలో చివరగా ఉన్న నన్ను తి.తి.దే. ఉద్యోగి మిక్కిలి మర్యాదగా నా కుడి చేయి పట్టుకొని మీరు ఇక్కడే ఉండండి. హుండీకి సీలువేసి పరకామణికి తీసుకువెళ్తాం. మీ సమక్షంలో సదరుకార్యక్రమం జరుగుతుంది. మీరు సాక్షి సంతకం చేయాల్సిందిగా చెప్పారు.

శ్రీవారి ఉద్యోగి నా చేయిని ఆ విధంగా పట్టుకొన్నప్పుడు నేను స్వామివారిసన్నిధిలో ఏదైనా అపచారం చేశానేమో అని భయ పడ్డాను. విషయం తెలిసిన తర్వాత నా ఆనందానికి అవధులు లేకుండాపోయాయి.

తి.తి.దే.వారు నియమనిబంధనలమేరకు హుండీకి సీలువేసి ఆనవాయితీగా అమలులో ఉన్న హుండీ సీలు వివరాలున్న పవిత్రపుస్తకంలో నా సాక్షిసంతకం తీసుకున్నారు. నా సహచరసాక్షిగా పీలేరుప్రాంతానికి చెందిన వేరొకరు సాక్షి సంతకం చేశారు.

నన్ను, సహసాక్షిని గర్భగుడిలోనికి హుండీప్రాంతంవద్దనున్న వాకిలు తెరిచి సదరు ఉద్యోగి శ్రీస్వామివారి సన్నిధిలోకి మమ్మల్నిద్దరినీ తీసుకెళ్ళి శ్రీస్వామివారి "పడివాకిలి"వద్ద ఉంచి ఉత్కృష్టమైన స్వామివారి సంపూర్ణదర్శనభాగ్యాన్ని ప్రసాదించారు. అటుపిమ్మట, శ్రీవైకుంఠవాకిలిద్వారంవద్ద మమ్మల్నిద్దరిని తీసుకెళ్లి ప్రాకారంలో పంపించారు.

ఆ తర్వాత 2009వసంవత్సరం మేనెల 15వతేదీ రాత్రి మా కుమారుని స్నేహితుడి వివాహసందర్భంగా తిరుచానూరు శ్రీపద్మావతీ అమ్మవారిగుడికి వెళ్లాం. సుమారు రాత్రి 8గంటలసమయంలో నేను, మా అబ్బాయి శ్రీపద్మావతిఅమ్మవారిని దర్శించుకున్నాం.

దర్శనానంతరం గుడి వెలుపలికొచ్చేప్రాంగణంలో అమ్మవారిగుడికి ఎదురుగా ఉన్న కార్యాలయం వద్దకు వచ్చాం. ఇంతక్రితం శ్రీస్వామివారిగుడిలో జరిగిన విధంగానే అమ్మవారి కార్యాలయ తి.తి.దే.ఉద్యోగి నన్ను నిలిపి అమ్మవారిహుండీకి సీలు వేస్తాం. మీరు సాక్షిసంతకం వేయాలని చెప్పారు. ఇది 'కలయా! నిజమా!!' అని నేను సంభ్రమాశ్చర్యాలకు లోనైనాను.

ఆరుసంవత్సరాలక్రితం స్వామివారిహుండీ సీలు కార్యక్రమాన్ని గురించి కార్యాలయ ఉద్యోగులకు చెప్పాను. స్వామి అమ్మవార్ల కృపాకటాక్షాలకు ప్రార్థనలు చేసుకున్నాను. నాతో కూడా ఉన్న అతనిని కూడా నాకు తోడుగా అనుమతించాలని కోరుకున్నాను. అటు పిమ్మట శ్రీపద్మావతిఅమ్మవారి హుండీకి సీలు వేసిన పిదప పవిత్రపుస్తకంలో నేను సాక్షి సంతకం చేశాను. అప్పటికే శ్రీఅమ్మవారికి పూలపానుపు, ఏకాంతపవళింపుసేవలకు వేళైనందువల్ల నన్ను, నాతో వచ్చిన అతనిని ఏకాంతసేవ కార్యక్రమంలో పాల్గొనేలా చేశారు. అమ్మవారి ప్రత్యేక ఏకాంతసేవ దర్శనభాగ్యాన్ని కలిగించారు. వెనువెంటనే అమ్మవారి గర్భగుడిని మూసేశారు.



శ్రీవేంకటేశ్వరస్వామివారికి, శ్రీపద్మావతిఅమ్మవారికి సుదీర్ఘసమయానంతరం వేరు వేరు సమయసందర్భాల్లో వారి పవిత్రహుండీలకు సీలువేసే కార్యక్రమాల్లో నేను ప్రత్యేకసాక్షిగా పాల్గొను మహద్భాగ్యము నాకు సంభవించడం శ్రీవారి అమ్మవార్ల ప్రత్యేక కృపాకటాక్షాలే!

ఇవి నా జీవితంలో సువర్ణ అక్షరాలతో లిఖింపదగిన భక్తిపూర్వకమైన మరపురాని సన్నివేశాలే! ఇదంతా పూర్వజన్మ సుకృతమే!!





ఒకచేత్తో కర్తవ్యాన్ని పాటిస్తూ, మరోచేత్తో భగవంతుణ్ణి ప్రార్థించాలి

బాలప్రబోధం

# యోగక్షేమాలు... కల్గిస్తాను!

- కుమారి వి. గురుప్రియ

ఒక ఊరిలో ఒక పేదబ్రాహ్మణుడుండేవాడు. ప్రతి రోజూ అతను భిక్షకు వెళ్లేముందు అత్యంతశ్రద్ధతో భగవద్గీతను చదివేవాడు. ఒకరోజు, అతను భగవద్గీత 9వఅధ్యాయంలో (9-22) ఈ క్రింది శ్లోకం పఠించాడు.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే!**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్!!**

నా దివ్యరూపాన్నే ధ్యానిస్తూ అనన్యభక్తిచే నన్ను సదా అర్చించేవారి యోగక్షేమాలను నేనే చూస్తాను అని శ్రీకృష్ణుడు ఉపదేశించిన మాట!

ఆ బ్రాహ్మణుడికి ఈశ్లోకం చదివిన తర్వాత ఒక సందేహమొచ్చింది. భగవంతుడు భక్తుల అవసరాలకు ఇతరులను ఆదేశించి భక్తులకోర్కెలు తీరుస్తాడుకదా! కానీ తానే స్వయంగా ఎలావస్తాడు? కొద్దిసేపు తీవ్రంగా ఆలోచించి ఒక కలం తీసుకుని ఆ శ్లోకం తప్పు అని దానిపై ఒక అడ్డగీత గీసేసి, భిక్షకు వెళ్లిపోయాడు. ఆ రోజు అతనికి కనీసం ఒక ధాన్యపుగింజ కూడా భిక్షగా దొరకలేదు. అతను భిక్షకు వెళ్లిన కొద్దిసేపటికి, అతని ఇంటి తలుపు ఎవరో తట్టారు. అతని భార్య వచ్చి తలుపుతీసింది. ఎదురుగా ఒక అందమైన అబ్బాయి ఉన్నాడు. అతని వీపుమీద ఏదో బరువుంది.

"అమ్మా! మీ భర్తగారు మా గురువు. అతను ఈ ధాన్యాలను మీకు ఇమ్మని చెప్పారు" అన్నాడు. ఆ బ్రాహ్మణపత్ని నమ్మలేదు. ఆ అబ్బాయి ఆమె భర్తపేరు చెప్పి తను తెచ్చిన సామగ్రిని ఆమెకిచ్చాడు. అప్పుడు ఆ అబ్బాయి వీపుపై ఎర్రని గీతలు చూసింది. "బాబూ! నీ వీపుమీద ఆ గుర్తులు ఏంటి?" అని అడిగింది.

అందుకు ఆ బాలుడు "అమ్మా నేను గురువుగారికి ఒకమాట చెప్పాను. అందుకాయన నన్నిలా శిక్షించాడు" అన్నాడు. అందుకు ఆమె అయ్యో! ఎంత దారుణం. నీవు లోపలికిరా నాయనా! నేను నీకు తినడానికి భోజనం సిద్ధం చేస్తానంటూ ఆ అబ్బాయిచ్చిన సంచిలోనుంచే అన్నీ తీసుకొని వంట చేసి, ఆ బాలుడికి వడ్డించింది. ఆ బాలుడు భోజనం చేసేసి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఇక బ్రాహ్మణుడు భిక్షకోసం తిరిగి తిరిగి ఏమీ దొరక్క విసిగి వేసారి ఇంటికొచ్చాడు. అప్పుడతని భార్య కోపంతో "ఏంటి మీకు ఒక శిష్యుడున్నాడా? ఆ అబ్బాయి ఏదో చెబితే మీరు దాన్ని తప్పంటూ, అతని వీపు మీద దెబ్బలు కొడతారా? రండి వచ్చి చూడండి." అని ఆమె భర్తను లోనికి తీసుకెళ్లింది. తీరా ఆ అబ్బాయి అక్కడలేడు. ఇల్లంతా వెదికారు. ఎక్కడా కనపడలేదు. ఆ బ్రాహ్మణుడు నేరుగా వెళ్లి భగవద్గీత తెరచిచూశాడు. తాను ఆ శ్లోకంపై కొట్టిన గీతలు కనిపించడం లేదు. అప్పుడతను నిజాన్ని గ్రహించాడు. బిగ్గరగా రోదించసాగాడు. నేనెంత మూర్ఖుణ్ణి. స్వయంగా భగవంతుడు చెప్పిన వాక్యాలనే శంకించాను. అతను ఒక సామాన్య బాలుడిగా, నా శిష్యుడిగా వచ్చి, నాకు గుణపాఠం నేర్పాడు. నేను గీసిన గీతలను, దెబ్బలరూపంలో తాను భరించాడు. నా భార్య ఎంతో అదృష్టవంతురాలు కదా! అతని దర్శనమన్నా చేసికోగలిగింది. నాకు స్వామిపై నమ్మకం లేదు కాబట్టే నాకు ఆ భాగ్యం కలగలేదు. నేను చాలా దురదృష్టవంతుణ్ణి అంటూ భార్యకు కలిగిన భగవంతుని దర్శనానికి, ఆ భగవంతునికి ఆమె చేసిన సేవకు ఆనందించాడు.

సారాంశం ఏమంటే- భగవంతుడి ఉపదేశాలను పూర్తిగా నమ్ముతూ వాటిని సరిగ్గా సమన్వయంచేసుకొని అర్థం చేసుకోవాలి. అంతే తప్ప మన బుద్ధికి తోచినట్లు వితండంగా వ్యాఖ్యానించుకోకూడదని అర్థం.



# వైద్యోనారాయణోహరిః

- శ్రీ వేమరాజు అనంతపద్మనాభం

సనాతనధర్మంలో దీర్ఘాయువుగా జీవించడంతో పాటు ఆరోగ్యంతో జీవించడం ఎంతో అవసరం. ఈ ఆరోగ్యసంపద యుక్తాహార, విహారాదులవల్ల, వ్యాయామంవల్ల చేకూరుతుంది. శారీరకమైన ఆరోగ్యం, మానసికమైన ఆనందానికి దారితీస్తూ జీవనం ఫలవంతం చేస్తుందని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

ఆరోగ్యప్రదాత శ్రీమన్నారాయణుని పంద్రెండవ అవతారమే ధన్వంతరి. భగవంతుని 21 అవతారాలపరంపరలో ధన్వంతరి అవతారం గూడ ఉన్నది. క్షీరసాగరమథనం జరిగినపుడు హాలాహలంనుండి, ధన్వంతరి మరియు అమృతం వరకు అనేకమైనవి బయల్వెడినవిషయం అందరికీ తెలిసిందే! ధన్వంతరి ఆవిర్భావం, స్వరూపం మనోహరంగా సంభవించింది.



నవంబరు-16 ధన్వంతరిజయంతి సందర్భంగా...

## ఆయుర్వేదవైద్యుడే ధన్వంతరి

అమృతకలశాన్ని చేతబట్టి ధన్వంతరి అనే పేరున్న ఆయుర్వేదవైద్యుడు పాలసముద్రంనుండి ఆవిర్భవించాడు. దేవతలకు వైద్యుడు. సకలశాస్త్రాలు తెలిసినవాడు. ఆజానుబాహువు. కంఠం శంఖంలా ఉంది. కన్నులు ఎర్రగా ఉన్నాయి. నల్లటి కేశపాశముంది. నీలమేఘవర్ణంతో విరాజిల్లుతున్నాడు. సింహం వంటి పరాక్రమంతో శోభిల్లుతున్నాడు. శ్రీహరి అంశతో ఆవిర్భవించిన ధన్వంతరి యాగంలో పెద్దభాగం పొందే అర్హతగలవాడు.

ఆహారనిద్రా వ్యవహారాల్లో మితాన్ని పాటించి యోగాభ్యాసంద్వారా సంపూర్ణఆరోగ్యం పొందవచ్చని పతంజలి యోగశాస్త్రం తెలుపుతోంది. ధన్వంతరియొక్క అంశయే పతంజలి అనీ పెద్దలమాట.

శాస్త్రం ఇంకా 'వైద్యోనారాయణోహరిః' అని వర్ణిస్తున్నది. వైద్యుని నారాయణస్వరూపంగా భావించడం మన సంప్రదాయం, ఆచారం.

ధన్వంతరిసంప్రదాయంలో ఆయుర్వేదంద్వారా వైద్యం చేయడమేగాక శస్త్రచికిత్సగూడ చేసేవారు. సుశ్రుతఋషిని-భారతీయ శస్త్రచికిత్సావిధానానికి పితగా భావిస్తారు. 'సుశ్రుత సంహిత' అనే గొప్ప గ్రంథం గూడ సుశ్రుతఋషి రచించారు. ధన్వంతరి ఆయుర్వేదంద్వారా పెద్దవ్యాధులు రాకుండా మన జీవనవిధానం మలచుకోవడం తెలియచేశారు. ధన్వంతరి దేవతలను వ్యాధులనుండి, ముసలితనంనుండి, మృత్యువునుండి కాపాడాడు. తర్వాతకాలంలో 'ధన్వంతరీనిఘంటువు' గూడ లభ్యమైంది.

దేశ, కాలాతీతంగా ప్రతి మానవుడు ఆరోగ్యంతో, ఐశ్వర్యంతో, సుఖసంతోషాలతో నిండునూరేళ్లు జీవించాలని కోరుకొంటాడు. శారీరక, మానసికమైన ఆరోగ్యాలు సమానంగా ఉంటే జీవితం పరిపూర్ణంగా, ఫలవంతంగాను, శాంతియుతంగాను కొనసాగుతుంది.

ఆరోగ్యప్రదాతయైన ధన్వంతరి నారాయణప్రసాదంగా మానవులను, లోకాన్ని ఆశీర్వదిస్తూ ఆనందమయం చేయాలని ప్రార్థిద్దాం. అలా జీవించుదాం... తరించుదాం....

సర్వేజనాః సుఖినోభవంతు







# పరబ్రహ్మస్వరూప భోజనాలయం

- శ్రీ జమలాపురం ప్రసాదరావు

**మనరాష్ట్రంలో ఎన్నో ఆలయాలున్నాయి...**
**ఆ ఆలయాల్లో దేవతామూర్తులున్నాయి......**

**ఆ దైవాన్ని దర్శించటానికి నిత్యమూ... ఆయా.... ఆలయాలకు ఎందరో భక్తులు సుదూరప్రాంతాలనుండి వ్యయప్రయాసకోర్చి వస్తుంటారు.**

**ఆయా దేవతామూర్తులకు.... ఎన్నెన్నో ఉత్సవాలు జరుగుతుంటాయి.**

**ఆ ఉత్సవాల్లో ఆయాదేవుళ్లకు ఎన్నో రకాల... అన్నప్రసాదాలు నైవేద్యం చేయబడుతాయి. తర్వాత, అవన్నీ కూడా దర్శనానికి వచ్చే భక్తులకు ఇస్తుంటారు.**

**అలా వారి ఆకలిని తీర్చటానికి పూర్వంనుండీ.... ఎందరో రాజులు, మహనీయులు ఎన్నో భోజనాలయాలను కట్టించారు.**

**ఎందరో అన్నదానకార్యక్రమాల్ని కూడా చేపట్టారు. 'అన్నం పరబ్రహ్మస్వరూపం' అని గదా పెద్దలమాట. ఆ అన్నం పెట్టే ఆలయాలే భోజనాలయాలు అని ప్రసిద్ధి.**

**ఈ ఆలయాల గురించి.... అన్నదానకార్యక్రమాల విశేషాలేంటో చెప్పడమే ఈ వ్యాసోద్దేశ్యం!!!**

## అన్నం పరబ్రహ్మస్వరూపం

ప్రతి మనిషికీ ఆహారం అవసరం. మనిషికే కాదు ప్రతిజీవికీ ఆహారం జీవనాధారం. "అన్నాద్భ వంతి భూతాని" అని గీతాసందేశం. మానవుడు ప్రప్రథమంగా ఆహారంకోసం విలపిస్తాడు. ఆహారం లేకుంటే ఆనందమే లేదు. "ఆనందోబ్రహ్మ" యని స్మృతివాక్యం. "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః" అని గీతావాక్యం. ఆత్మారాముడు అందరిలో ఉన్నాడు. మనిషి పుష్టిగా, సంతుష్టిగా, ఆరోగ్యంగా ఉండాలంటే ఆహారమెంతో అవసరం. అన్నంవిషయంలో పేద, ధనిక, లింగవివక్ష, పిన్న, పెద్ద, పశుపక్ష్యాదులు, కీటకాలన్న భేదముండదు. ఆకలనేది అందరికీ సమానమే. కాని అది అనుభవించినప్పుడే దానివిలువ తెలుస్తుంది.

భగవంతుడు ప్రతివారికి అప్పుడప్పుడు ఈ బాధను అనుభవంలోకి తీసుకొస్తూంటాడు. ఉదాహరణకు మనం పక్క ఊరికి వెళ్లినపుడు ముందు భోజనాలయం ఎక్కడుందాయని విచారణచేస్తాం. అది కనిపించనప్పుడు ఆపదమొక్కులవాడు కని పిస్తాడు. అన్నమో రామచంద్రాయని కేకలు వేస్తాం. అందుకే 'అన్నం పరబ్రహ్మస్వరూపం' అన్నారు పెద్దలు. తాను తినేది అన్నమైనా అందులో కొంత నలుగురికి ప్రసాదంగా పంచేటట్లు చూడాలి. ఆ ప్రసాదమే మహాయజ్ఞంగా మారుతుంది. దానికి అతడే కర్త అవుతాడు.

## పెట్టినవాడికి పుట్టుడే సాక్షి

ప్రతివ్యక్తీ యజ్ఞకర్తగా తయారైతే భోక్తగా పరబ్రహ్మ ప్రత్యక్షమౌతాడు. 'అక్కరకు అన్నం ఆరోగ్యానికి ఔషధం' అన్నంతోనే అన్నం పుడుతుంది. 'పెట్టినవాడికి పుట్టుడే సాక్షి' అని ఆర్యోక్తి.



## యద్భావం తద్భవతి

ఆకలౌతోంది కదా అని అన్నం ప్రతిచోటా తింటే అది పరబ్రహ్మ కాదు. అన్నం ప్రతిచోటా తినవచ్చు కానీ దాన్ని 'భోజనాలయం' అనరు. చెట్లనీడన కూర్చుని తింటే దానిని వనభోజనాలు అంటారు. ఇంట్లో తింటే ఇంట్లోభోజనమంటారు. అన్నమనేది పవిత్రమైన వాతావరణం కల్గిన దైవ సన్నిధిలో తింటే దానిని భోజనాలయమని చెప్పొచ్చు. అక్కడ ప్రసాదం తిన్నా భోజనమే అవుతుంది. భోజనం తిన్నా ప్రసాదమే అవుతుంది. అక్కడ మనమే అన్నభావనతో తింటే ఆ భావన మనకు కల్గుతుంది. ఈ ఆలయంలో పేద, ధనిక అనిగానీ, చిన్న, పెద్దయనిగానీ, జాతి, కుల, మతబేధాలుండవు. కోటీశ్వరుడినుండి కటిక పేదవాడివరకు పరమాత్మునివద్ద చోటుంటుంది. భోజనాలయం పవిత్రస్థలంలో ఉంటే అక్కడ భక్తులుంటారు. భక్తులెక్కడుంటారో అక్కడ భజనలుంటాయి, భగవంతుడుంటాడు. అక్కడి వాతావరణమంతా హృదయానందంగా, నిత్యనూతనంగా, ఆనందనిలయంగా భగవంతుడు అందరి హృదయాల్లో ఆదిత్యుడుగా నిండి ఉంటాడు. కొందరిలో వైశ్వానరుడిగా, మరికొందరిలో అద్వేష్టా సర్వభూతాని అనే భావన కల్గి, గోవిందనామంతో అందరిలో కలిసి కనిపిస్తాడు.

## అతిథిదేవోభవ...

పూర్వం ప్రతిగృహిణి అన్నం మొదట అతిథికి పెట్టకుండా తాను తినేది కాదట. అతిథికి అన్నంపెట్టి ఆరోగ్యం కాపాడుకునేవారు. ఆ రోజుల్లో, ఇంట్లో కుటుంబసభ్యులందరికి పెట్టి మిగిలింది తాను ప్రసాదంగా భుజించేవారు. వారి త్యాగమే పుష్పించి ఫలించేది. స్త్రీలు అన్నపూర్ణలని లోకోక్తి. శబరి శ్రీరామునికి పండ్లు ఫలాలిచ్చి ఆకలి తీర్చింది. కుచేలుడి భార్య కృష్ణునికి పిడికెడు అటుకులు పంపి కుబేరసంపద పొందింది. ద్రౌపది కృష్ణుడికి అన్నంమెతుకు పెట్టి అక్షయపాత్రను పొందింది. అలిగిన అలమేలుమంగ ఆపదమొక్కులవాడి చెంతకు చేరింది. అన్నం పెట్టి అందరికీ ఆరోగ్యం ప్రసాదిస్తోంది. యజ్ఞయాగాదులచే దేవతల ఆకలి తీరిస్తే తిరిగి వారు మన ఆకలి తీరుస్తారు. దైవసన్నిధిలో అన్నదానం ఒక యజ్ఞం– ధనసహాయం ఒక యజ్ఞం అని గీతలో కృష్ణుడు చెప్పాడు. "ఉడుతాభక్తి ఊరందరికీ మేలు" అని సూక్తి.

పూర్వం పట్టణాల్లో అన్నసత్రాలుండేవి. ఆ సత్రాల్లో దేవతాప్రతిమలుండేవి. వండిన అన్నం భగవంతునికి నివేదించి, దానిని భక్తులైన ఆర్తులకు, అతిథులకు, అభ్యాగతులకు అందించేవారు. సత్ఫలితాలు పొందేవారు. అలా ఇప్పుడు చాలా మంది తమ పెద్దలపేరుతో, పెరుమాళ్లపేరుతో పుణ్యక్షేత్రాల్లో అన్నదానాలు చేసి పుణ్యమూ, ఆరోగ్యమూ పొందుతున్నారు.

## అన్నాన్ని భగవంతుడే సృష్టించాడు

అన్నము మొదలైన భోగవస్తువులన్నీ కూడా భగవంతునిసొత్తు. ఏలయనిన దానిని మనము తయారుచేయలేము. పరమాత్ముడే వర్షాలు కురిపించి, సస్యములోకి జీవశక్తిని ప్రోద్దీపింపజేసి ధాన్యాలను సృష్టించాడు. కాబట్టి ఆ ధాన్యమూల్యాన్ని భగవంతునికి చెల్లించాలి. భక్తియే దాని మూల్యం. అన్నాన్నే భగవంతునికి కృతజ్ఞతాపూర్వకంగా నివేదించాలి. అలాగే కొంత భాగాన్ని ప్రాణికోటికి సమర్పించాలి. 'దానాలన్నింటికన్నా అన్నదానమే గొప్పది'. ఈ కాలం, ఆ కాలం అని గానీ, అంతా, ఇంతా అనిగానీ చెప్పక్కరలేదు.

ప్రతిజీవి దుఃఖరాహిత్యం, ఆనందప్రాప్తి ఈ రెండింటినీ కోరుకుంటాడు. దీనికి మనోనిర్మలత్వం ముఖ్యం. మనోనిర్మలత్వం దైవప్రసాదం తినటంవల్ల లభిస్తుంది. ప్రసాదం అంటే ప్రసన్నత కల్గించేది. మనస్సుకు శాంతి, నిర్మలత్వం కల్గించేది. అన్నం పరబ్రహ్మస్వరూపం. అది అందరి స్వస్వరూపం.

## అగ్నిమీద అన్నం అందరికీ అవసరం

దేవునికి నివేదించకుండా, దైవభావము లేకుండా భుజించేది అపవిత్రమౌతుంది. పవిత్రస్థలంలో భుజించే భోజనం అమృతంగా మారుతుంది. భగవంతుడు జఠరాగ్నిరూపంలో ఉంటాడు. కనుక దేహనిర్మాత, దేహపోషణకర్తయని భగవద్గీత చెప్తోంది. "అగ్నిమీద అన్నం అందరికీ అవసరం". మానవుడి మనసు తేటగా, నిర్మలంగా, కలతపడక ఉండాలి. మనసు మీద ఆహారంయొక్క ప్రభావముంటుంది. అది పవిత్రమూ, సాత్వికమూ అయి ఉండాలి. దైవప్రసాదమే అందరికీ అవసరం. దానికి భోజనాలయమే శరణ్యం.

ఆలయాలు వేరైనా ఆశయం ఒక్కటే!
ఆపదలు వేరైనా ఆదుకునేవాడు ఒక్కడే...!







మనసు బాగోలేనప్పుడు శరీరాన్ని వ్యసనానికి బానిసచేయకుండా శ్రమకు బానిస చెయ్యాలి

# శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం, కొండబిట్రగుంట

- ఆచార్య కె.నాగరాజరావు




### బిట్రగుంట / బెటర్‌గుంట - పేరు ఎలా వచ్చింది?

బిట్రగుంట ప్రాముఖ్యతను ఆనాడే గుర్తించి, గ్రహించి ఉపయోగించుకున్న నేర్పరులు ఆంగ్లేయపాలకులు. వారి కాలంలో తమ రైలుబండ్లకు నీటిస్టేషన్‌లను (వాటరింగ్ స్టేషన్స్) ఏర్పాటుచేశారు. బిట్రగుంటలో అప్పటి అధికారి పలుచోట్ల నీటిగుంటలు త్రవ్వించారు. ఒక్కో గుంటలో నీటి రుచి ఒక్కోరకంగా రుచించేదట. ఆయన ఆశ్చర్యంతో అన్ని నీటిగుంటలకన్నా ఒకచోట నీటిని ఎంపిక చేసి ఆ ప్రదేశాన్ని 'బెటర్‌గుంట' అన్నారట. బిట్రగుంట స్టేషన్‌లో రైలుఇంజన్లను ఉంచే 'హౌస్ ఆఫ్ స్టీల్ హార్సెస్" ప్రదేశం పలువురిని ఆకర్షించేది. ఇనుప ఇంజన్లలాంటివి, రైల్వేసంబంధిత ఇనుప సామగ్రి ఈ ప్రాంతాల్లో సులభంగా తుప్పుపట్టదు అని, ఓ గుంటలో నీరు 'బెటర్' అనీ బెటర్ ప్లస్ గుంట బిట్రగుంట అయ్యింది అట. ఒకవేళ నీరు చేదుగా ఉంటే అది 'బిట్టరగుంట' అయి ఉండేదేమో!

నెల్లూరుజిల్లాలోని బోగోలు మండలంలోని కొండబిట్ర గుంటగ్రామంలో శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి ఆలయం ఉంది.

### పురాణగాథ

గజేంద్రమోక్షం తర్వాత శ్రీవిష్ణువు వైకుంఠం బయలు దేరాడు. ఆ సమయంలో నారదాదిమునులకోరికపై, భూలోక వాసులకు విష్ణువును ఎల్లప్పుడు సందర్శించేభాగ్యాన్ని కలుగ జేసేందుకు స్వామివారు ప్రసన్నులై దేవేరిసహితంగా శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామిగా కొండబిట్రగుంటపై వెలసారని గాథ. భృగుమహర్షి శ్రీమహావిష్ణువు వక్షఃస్థలాన్ని కాలుతో తన్నడంవల్ల, దేవేరికి ఆగ్రహం, అలక వచ్చాయని, అందువల్ల స్వామివారు ఒకచోట, దేవేరి పద్మావతి (లక్ష్మి) ప్రక్కప్రక్కనకాక వేరువేరుగా అప్పట్లో ప్రతిష్ఠింపబడ్డారట.

### స్థలపురాణం

కొందరు స్థానికుల కథనం - గౌరవరం రాకుమార్తె ప్రతిరోజు తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంనుంచి ప్రసాదాన్ని భటులు అశ్వంపై బిట్రగుంటకు వచ్చి అందజేసిన తర్వాతే అంతఃపురంలో భోజనం చేసేదట. ఓ వారం కుంభవృష్టి వల్ల కొండబిట్రగుంటనుండి తిరుమలకు రాకపోకలు ఆగి పోయాయట. అంచేత ఉపవాసాలు చేస్తున్న రాజవంశీయురాలికి స్వామివారు కలలో కనబడి "నేను ఫలానా చోట ఉన్నాను. నా విగ్రహాన్ని తీసి పూజించు. ఆలయం నిర్మించు." అని చెప్పాడట. ఆమె రాజుగారితో ఆ విషయం చెప్పి ఆలయాన్ని నిర్మింపజేసిం దట. ఆ విధంగా ఆలయనిర్మాణం చోళసామంతీ సుధర్ముడు, గజపతులవారి వారసుడైన చక్రవర్తి పరిపాలనకాలంలో జరి గిందట.

### చీకటిబిలం

ఆలయ దక్షిణప్రాకారపుగోడ వెంబడి ఉన్న బ్రహ్మాండ మైన ఓ చీకటిబిలంగూండా ప్రయాణిస్తే సరాసరి తిరుమలలోని శ్రీబాలాజీఆలయసన్నిధికి చేరుకోవచ్చుట. అర్చకస్వాముల సంతతి వారొకరు "మా చిన్నతనంలో ఈ బిలంవద్ద చిన్న పిల్లలు ఆటలు ఆడుకుంటూ ఉండేవారు. అప్పట్లో బిలం నుంచి సుగంధ బంధురమైన సువాసనలు వస్తుండేవని మా పూర్వీకులు చెబుతుండేవారు" అన్నారు.




కష్టంకన్నా కష్టంలో ఉన్నామనే భావనే మనల్ని ఎక్కువగా బాధపెడుతుంది

## సాక్షాత్తు నారదమహామునివారే....
## స్వామివారిని ఇచ్చట ప్రతిష్ఠించారని విశ్వాసం!!

### నారదులవారితపస్సు

దక్షప్రజాపతి తాను చేసే యజ్ఞానికి పరమశివునకు ఆహ్వానం పంపలేదట. అప్పుడు నారదమహర్షి దక్షునితో "శివుని ఆహ్వానించు" అని సూచించాడు. ఆ మాటలకు దక్షుడు ఆగ్రహంతో నారదులవారికి శాపమిచ్చారట. ఆ శాపవిమోచనం కోసం నారదమహర్షి తపస్సు ఆచరించిన ప్రదేశమే బిలకూట పర్వతం అయిందట. నారదునకు శ్రీమహావిష్ణువు వేణుగోపాలుని అవతారంతో దర్శనమిచ్చారట. ఇక్కడ స్వామి ప్రసన్నులైనవారు



కనుక ఇక్కడిదైవాన్ని శ్రీప్రసన్నవేంకటేశ్వరస్వామిగా పిలుస్తున్నారట.

ఐదారు శతాబ్దాలక్రితం అప్పటి దక్కనుప్రాంతరాజు లాంగూలమహారాజు బిట్రగుంటకొండపై స్వామివారికి, అల మేలుమంగతాయారుకు ఆలయాలు నిర్మించారనే కథనం కూడా ఉంది. కల్యాణమండపం, శ్రీవేణుగోపాల, శ్రీకృష్ణ, శ్రీఆంజనేయ స్వామివారల ప్రతిష్ఠ కూడ జరిగిందట.

### సంతానగోపాలస్వామి

శ్రీసంతానగోపాలస్వామివారిని ఆరాధిస్తే సంతానంలేని వారు సంతానాన్ని పొందుతారని ఆ ప్రాంతీయుల ప్రగాఢ విశ్వాసం. ధ్వజారోహణంసందర్భంలో స్వామివారిని భక్తితో సేవించి కొడిముద్దలు స్వీకరించే దంపతులకు సంతానభాగ్యం కలుగుతుందని భక్తులవిశ్వాసం.

### వదాన్యులు

1989లో పెనుతుపాను సంభవించినప్పుడు దేవస్థానపు రథం శిథిలమైపోయింది. అప్పుడు దాతలు రథనిర్మాణానికి, రాజగోపురనిర్మాణానికి సాయం చేసి శ్రీప్రసన్నవేంకటేశ్వరుల కృపాకటాక్షానికి పాత్రులయ్యారు. అంతకుముందు ఎన్నో సంవత్సరాలక్రితం ఈ ఆలయాభివృద్ధికి ఎనిమిదెకరాలమాగాణి, బంగారుఆభరణాలు కమ్మవారిపాళెం వాస్తవ్యురాలు కీ.శే.వింజం వేంకటసుబ్బమ్మ స్వామివారిసేవకు భక్తితత్పరతతో కృషిచేశారు.

### బిలవేదాంతరహస్యం

కొండబిట్రగుంటలో గల చీకటిబిలం లాంటిదే సింగ రాయకొండ ఆలయప్రాంతంలోనూ, శ్రీశైలసమీపఆలయప్రాంతం లోనూ ఉండేవనీ, వీటిద్వారా నేరుగా తిరుమలేశుని ఆలయం సరాసరి చేరుకోవచ్చునని నమ్మకం ఉండేదట. గతంలో చుండి రాజావద్ద పని చేసిన ఉద్యోగి మునుపు ఓ దివాన్ సాహసించి ఆ బిలంలోకి కొద్దిదూరం వెళ్లి గ్రుడ్డివాడైపోయి వెనుదిరిగి వచ్చేశారు అని చెప్పాడు. ఈ బిలాలకు మరోవేదాంతపరమైన నిర్వచనం కూడా ఉంది. తిరుమల బ్రహ్మనాడి. దేహంలోని అన్నినాడులూ బ్రహ్మనాడికి మార్గాలు. సాధనాలు. అన్ని మార్గాలూ భగవంతుని చేరుకునే మార్గాలే కదా!





ఈ ప్రపంచంలో గొప్ప ఆనందాలన్నీ మొదట్లో చాలా బాధపెట్టేవే!

### బిలకూటరహస్యం

ఈలాంటి బిలమార్గంద్వారానే, ఎఱుకలసానివేషంలో స్వామి ఆకాశరాజు పురానికెళ్లాడు. రాకుమార్తె పద్మావతిదేవిని, శ్రీశ్రీనివాసునకిచ్చి వివాహం చేయాల్సిందిగా సోదె చెప్పినట్లు ఐతిహ్యం ఉంది.

ఆకాశరాజు సోదరుడు చక్రవర్తిగా ఉన్నసమయాన ఓ యాత్రికుడు తన కుటుంబసమేతంగా వచ్చి 'రాజా! మేము కాశీయాత్రకు వెళ్తున్నాం. వృద్ధులైన మా కుటుంబసభ్యులను మీ రక్షణలో ఉంచుతాం. తిరిగి స్వగ్రామం వెళ్లేటప్పుడు వృద్ధులను మా వెంట తీసుకెళ్తామని అభ్యర్థించారట. రాజు 'సరే' అన్నారట. ఆ రోజుల్లో విరోధుల దండయాత్రలు మొదలైన వాటి వల్ల ఆ వృద్ధకుటుంబసభ్యుల్ని ఒక రహస్యప్రదేశాన దాచి ఉంచారట. ఆహారపదార్థాలిచ్చే ఏర్పాటు కూడా చేశారట. కాని, తర్వాత ఆ ముసలివారి రక్షణను మరచిపోయారట. అన్న పానాదులు లేక వృద్ధులు మరణించి అస్తిపంజరాలైపోయారట. తర్వాత ఎప్పుడో ఆ వృద్ధులవిషయం గుర్తుకొచ్చి, రహస్యప్రదేశం తలుపులు తెరిపించి, తన తప్పిదాన్ని గ్రహించి ఏమీ చేయలేక, మృతజీవులఅస్తికలు మూటకట్టుకుని ఆ రహస్య 'బిలం' (సొరంగము) ద్వారా తిరుమల చేరి తిరుమలేశుని ప్రార్థించారట. ఆ ప్రార్థనకు చనిపోయిన వృద్ధులు పునర్జీవితులైనారని పురాణాలు చెప్తున్నాయి. ఇతిహాసం ప్రకారం ఆ కాలాన రాజులాంటి భక్తులతో ప్రత్యక్షంగా కనబడి మాట్లాడే శ్రీనివాస దేవులు తర్వాత కేవలం తన ఆలయ ప్రధానఅర్చకులతో మాత్రమే మాట్లాడేవాడని, ఆ తర్వాతకాలంలో దేవదేవుడు మౌనం వహించాడట. ఈ విషయం పురాణ ఇతిహాసాల్లో ఉంది.

### కొండబిట్రగుంట శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామి- మరో కథనం

గౌరవరం చోళరాజుల కాలం అది. గౌరవరం రాజ కుటుంబానికి చెందిన గౌరమ్మకి కలలో కనబడిన స్వామి "నేను బిలంలో ఉన్నాను. నా విగ్రహం తీసి పూజించండి" అన్నారట. ఆయనే చెన్నకేశవస్వామి అని, కుడిచేతిలో శంఖం, ఎడమ చేతిలో చక్రం ఉన్నాయట. గౌరమ్మ అలానే ఆలయం కట్టించింది. ఆవిడ దైవసాన్నిధ్యంచే రాక ఆమే నాంచారమ్మగా జన్మించిందట. ఆమె కూడ ఆలయనిర్మాణం అయ్యాక, స్వామివారిలో ఐక్యం అయిందట.

నాంచారమ్మగారిని గూర్చి ఓ వయోవృద్ధులు "ఆమె వివాహం చేసికొన్న తర్వాత కొన్ని సంవత్సరాలకు సన్యసించి స్వామిసేవ చేసిందట. భర్త గతించాక నాంచారమ్మ భిక్షాటన చేసి ఆ ధనం ఆలయనిర్మాణానికి ఉపయోగించిందట. భక్తుల నుంచి ఆవిడ దమ్మిడీ (అణాకు పన్నెండుదమ్మిడీలు)లు, లేదా రూపాయి, చింతపండు ఇలా భక్తులు ఏమిస్తే వాటిని దైవకార్యానికి వినియోగించేదట. ఓ మారు దొంగలు ఆమె సేకరించిన చందాలను తస్కరించ ప్రయత్నించారట. ఆమె 'వెంకయ్యా దొంగలు వచ్చారు" అనగానే భయోత్పాతంతో దొంగలు పారిపోయారట. గౌరమ్మ విగ్రహం అలమేలుమంగమ్మ మహామండపంలో సాక్షాత్తు సాష్టాంగనమస్కారం చేస్తున్నరీతిలో ఉంది. అరవైఅడుగులఎత్తు ఉన్న ఆలయశిఖరాన్ని శ్రీగౌరవరపు సుబ్రహ్మణ్యంచేత మొదలుపెట్టించి పూర్తి చేయించినట్లు స్థానికుల మాట. ఆ కాలంలో బిలకూటసొరంగంలో గుర్రపు బండ్లు గౌరవరం నుంచి బిట్రగుంటవరకూ వెళ్తూ ఉండేవట.



### వైకుంఠపాళి
### :: 24 - సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 సీ | 2 తా | ప | 3 హ | ర | 4 ణ | ము | |
| 5 కా | | వి | | ళ్లీ | | జా | | 6 జా |
| 7 హ | లి | | 8 కే | స | రి | | 9 మా | య |
| ళి | | 10 గాం | | కం | | 11 అ | | ప |
| | 12 మాం | ధా | త | | 13 శ | హ | న | |
| 14 వి | | రి | | 15 ప | | ల్య | | 16 క |
| 17 లా | స్యం | | 18 అ | తి | వ | | 19 పం | ద |
| సి | | 20 టాం | | ప్ర | | 21 వీ | | ళి |
| | 22 గం | గా | వ | త | ర | ణ | ము | |



# కైంకర్యమే.. తనువు దాల్చితే....

19

- డా॥ కంపల్లె రవిచంద్రన్



**(మధురకవులు శ్రీనమ్మాళ్వార్లవారిని ఆచార్యులుగా స్వీకరించే ప్రయత్నంలో శ్రీనమ్మాళ్వార్లవారి వైభవాన్ని కనులారా చూస్తున్నారు)**

భగవంతుడు ప్రాణులకు కరణ కళేబరాలను ఇవ్వగా, వాళ్లు వాటిని సరిగా వినియోగించడం లేదు. అందుచేత, వీరిని సంహారం చేశారు. అంటే... ఏడుస్తూ ఉన్న బిడ్డ ఏడుపును పోగొట్టడానికి తల్లి ఉయ్యాలలో వేసినట్లు గర్భంలో ఉంచు కున్నారు. స్వామికి దయ అభ్యర్థన చేయగా, అతడు కరణ కళేబరాలు ఉంటేనే కదా నా దగ్గరకు వస్తుంటారని భావించి, వాటిని ఇచ్చి వీటితో శ్రవణ మననాదులు చేసి ఎలా రావాలో అలా రండి అన్నాడు. కరణ కళేబరాలు కలిగినందుకు ఫలం గురువును ఆశ్రయించి శరణాగతి చేసి మోక్షానికి పోవాలని ప్రత్యుత్తరం ఇచ్చిన నమ్మాళ్వారు అవతార పురుషులే అని భావించి తనను శిష్యునిగా స్వీకరించి అనుగ్రహింపవలెనని మధురకవి ప్రార్థించాడు.

శ్రీకృష్ణభగవానునికి అర్జునుడు శిష్యుడైనట్లు, శఠగోపులకు మధురకవిని శిష్యునిగా భగవంతుడు చేర్చాడు. ఒకరు ఉపదేశించగా, మరి ఒకరు గ్రహించాలి. శిష్యునిపై గురువుకు అనుగ్రహం కలగాలి. గురువు మీద శిష్యునికి భక్తి కలగాలి. శాస్త్రాలు అన్నీ అన్నిచోట్లా వెలువడాలని భగవత్సంకల్పం. భగవంతుడు ఈ విధంగా గురుశిష్యులను ఒకచోట చేర్చి, తాను సహా అక్కడికి గరుడారూఢుడై వేంచేశాడు. అలా దివ్యప్రకాశంతో పోయి శఠగోపులతో సంభాషించగా – "ఆహా! వీరిని చూడడానికి స్వామివారు స్వయంగా విచ్చేశారే! నన్ను కూడా ఈ పవిత్ర ప్రదేశానికి చేర్చారే!!" అని మధురకవులు ఆశ్చర్యంతో పాటు, ఆనందాన్ని పొందారు.

నమ్మాళ్వార్లు యోగమార్గాన్ని అనుసరించి, కాలం గడిపిన మహనీయుడు. అయినా ఆయనకు అన్నికాలాల్లో అన్ని వస్తువులూ భగవత్స్వరూపాలు గానే కన్పించేవి. మేఘాల్ని చూచినా, పర్వతాల్ని చూచినా, సముద్రాల్ని చూచినా – "ఆ నీలమే గదా! ఆ ఆనందమే గదా!" అంటూ ఆ నీలమేఘ శ్యాముణ్ణి తలచి తలచి, ఆయన మనసులోని సంతోషం ఆయన్ను వదలి, పరిగెత్తుతూ ఉండేది. ఆయనేమో చీకటిని చూచినప్పుడు ఆ భగవంతుని దివ్యదేహాన్ని చూచినట్లే చూచేవారు. ఆ వర్ణం ఆయనను అంతగా ఆకర్షించింది కాబోలు!

అంతేకాదు ఏదైనా ఒకజ్యోతిని చూచినా–కోకిలలు, నెమళ్లు మొదలైన పక్షుల్ని చూచినా– అల్లోనేరేడు మొదలైన నల్లని పండ్లను చూచినా – ఆ భగవంతుణ్ణి దర్శించినట్లే ఆనందించేవారు. ఇలా దర్శించి, అనుభవించడం ఒకనాడు కాదు– రెన్నాళ్లు కాదు – మూన్నాళ్లు కాదు – ఎన్నో ఏండ్లు అనుభవించి, దీని అంతు తెలుసుకోలేకపోయారు. అయితే ఊరికే ఉండనిస్తుందా మనస్సు? లేదు. నలుపు–నీలం– పచ్చరంగులు చూచినప్పుడంతా ఏదో తాను చేరదలచిన పరమార్థాన్ని చేరినట్లు ఆశ! సమీపించలేక కొన్నిసమయాల్లో దుఃఖాన్నీ – కొన్ని సమయాల్లో సంతోషాన్నీ పొందుతూ "ఇది దైవికశక్తి" అని నిట్టూర్పు వదలుతున్నారు. అదిగో తెల్లవారుతూంది! ఇప్పుడు వికసించిఉన్న నల్లకలువల్ని – తామెరలను ఇంకా చిత్రవిచిత్రాలైన పూవుల్ని చూచి, నమ్మాళ్వార్ ఏమంటున్నారో వినండి– "ప్రాణం, శరీరం, ఒకటిగా వికసించి, ఊప్పొంగిపోతున్నాయి–పూలు; ఆ దివ్యమంగళవిగ్రహుడైన భగవంతుడే ఈ పూల రూపంలో వచ్చి, మన బోటివారికి దర్శనమిస్తున్నాడు" అంటూ ఏదో పాడుతున్నారు – ఆ ఆనందపారవశ్యంలో –





**పూవైయుం కాయావుం నీలముం పూక్కిన్ఱ**
**కావిమలర్ యెన్టుం కాండోరుం, - పాపియేన్**
**మెల్లావి మెయ్మిగవే పూరిక్కుం, అవ్వవై**
**ఎల్లాం పిరానురువే యెన్టు!**

"పూవులు - కాయలు - నీలంగా, ఎరుపుగా పూస్తున్నాయి. వీటినన్నిటిని చూచాను. దివ్యమంగళవిగ్రహుడైన ఆ భగవంతునిదివ్యశరీరాన్ని తలపిస్తున్నాయి. శరీరం, మనస్సు పులకరిస్తూంది. పాపినైన నేను ఇవ్వన్నీ ఉత్తపూలని చూచినాను" అన్నాడు.

ఈ పూలన్నీ ఉత్తపూలుగా భక్తుడైన ఈయన కన్నులకు తెలీలేదు- కాబోలు! "ఓహో! భ్రమించినాను - తెలిసికొన్నాను. అబ్బా! ఒకసారి కాదు - ఎన్నోమార్లు హెచ్చరించినా బుద్ధి వినేటట్లు లేదు. ఆశ వదిలేటట్లు లేదు. తెలుసుకొన్నాను అనే అజ్ఞానపు తెలివికన్నా ఈ భ్రమే మేలని తోస్తూంది. ఏది ఏమైనా ఈ భ్రమలో ఉన్న సంతోషం ఆ తెలివిలో లేదు. పాపినైన నాకు కూడా ఇలాంటి భాగ్యమా?" అంటూ కన్నీరు కారుస్తూ,



## 2017 డిసెంబరు నెల ముఖ్యమైన పండుగలు

**01** హనుమద్వ్రతం
**02** కార్తికదీపోత్సవం
**03** దత్తజయంతి
**13** స్మార్తఏకాదశి
**14** వైష్ణవఏకాదశి
**16** ధనుర్మాసం ప్రారంభం
**29** వైకుంఠఏకాదశి
**30** శ్రీస్వామివారి పుష్కరిణీతీర్థముక్కోటి

హృదయం పొంగిపోతూ పలవిస్తున్నారు. రోజులు గడుస్తున్నాయి. తమ యోగాభ్యాసాన్ని సాగిస్తున్నారు- నమ్మాళ్వార్లు.

ఒకనాడు కన్నులు తెరిచి, వికసించిన నల్లకలువల్ని చూచి, ఆశ్చర్యపడ్డారు. సిగ్గుతో తలవంచుకుని ఏదో చెబుతున్నారు- వినండి. "ఆ భగవంతునివర్ణమైన నీలవర్ణాన్ని మీరు పొందారు. ఎంత భాగ్యవంతులో కదా మీరు! మీరేమి తపస్సు చేశారో!!" అని. తలపైకెత్తి అరెరే! తెలిసికొన్నాను! ఎండనక, వాననక, మంచనక ఈ నీటిమధ్యలో ఒంటికాలిపై నిలిచి, తపస్సు చేస్తున్నారు కదూ! అని - అందువల్లే పూలకు ఆ భగవంతునివర్ణం కలిగింది అని కాబోలు నమ్మాళ్వార్లనమ్మిక. అయితే ఈ విధంగా ఎండకు, వానకు, మంచుకు బాధపడుతూ తపస్సు చేయడానికి నమ్మాళ్వార్లహృదయం ఒప్పుకోవడం లేదు.

తలపైకెత్తి ఆకాశం వైపు చూస్తున్నారు - చూస్తూ "మీరు ఆ దేవదేవుని దివ్యశరీరవర్ణాన్ని కొల్లగొన్నారే! ఈ యోగం మీకెట్లా వచ్చింది? ఈ ప్రపంచాన్నంతా ఆకాశరూపంగా వ్యాపించి, ఏమి తపస్సు చేశారో?" అంటుండగా మేఘాలు కొన్ని వారికన్నుల ఎదుట కన్పించాయి. వెంటనే నమ్మాళ్వార్లు దూరంగా పోతూఉన్నమేఘాలు వినేటట్లు "ఆ! ఆగండి ఓ మేఘాల్లారా!" అంటున్నారు-ఎందుకో?- ఆ మేఘాలను ఏదో ప్రశ్నిస్తామనుకొన్నట్లుంది - నమ్మాళ్వార్లు. మేఘాలు నిలిచాయి. కానీ, నమ్మాళ్వార్లు ప్రశ్నించలేదు.

*(ఇంకా ఉంది)*



మంచిపుస్తకం మంచి స్నేహితుడివంటిది

# శ్రీమదాంధ్ర భాగవత నామసర్వస్వము

రచయిత - పుత్తా పుల్లారెడ్డి,
పుటలు- 414, ఆకృతి- 1/8 డెమ్మీ ఆకృతి,
వెల- రూ.249/-,
ప్రతులకు - పుత్తా పుల్లారెడ్డి, ఇ.నెం.1-435-6-1,
మారుతీనగర్, కడప-516 001.
చరవాణి - 99592 41001

అష్టాదశపురాణాల్లో ప్రముఖమైనది, భక్తిభావ బంధురమైనది భాగవతపురాణం. ఈ పురాణానికి ఎన్నో అనువాదాలు, వ్యాఖ్యానాలు వచ్చాయి. ఐనా ఈ గ్రంథాన్ని అవగాహన చేసుకోవడానికి ఆధ్యాత్మికవిదులు చాలా శ్రమపడుతున్నారు. దీనికి ప్రధానకారణం ఈ గ్రంథం పురాణం కావటంవల్ల అంత తేలికగా అవగాహన కాదు. అందుకే 'శ్రీమదాంధ్రభాగవతనామసర్వస్వం' అనే పేరుతో పుత్తా పుల్లారెడ్డిగారు ఈ గ్రంథాన్ని వెలుగులోకి తెచ్చారు. దీనికి 'శ్రీవేంకటీయం' అని పేరు పెట్టారు.

ఈ గ్రంథంలో మహాభాగవతపురాణం లోని పేర్లను అకారాదిక్రమంలో కూర్చాడు. ప్రతి పేరు గ్రంథంలో ఎక్కడ ప్రయోగించ బడిందీ చెప్పాడు. ఆ పాత్ర నేపథ్యాన్ని, స్వరూప స్వభావాలను పేర్కొన్నాడు. గ్రంథాంతంలో సూర్యవంశం, చంద్రవంశం, స్వాయంభువవంశంలోని వారివి పట్టికరూపంలో ఇచ్చాడు. ఎంతో పరిశీలనాశక్తి కౌశలం ఉంటే తప్ప ఇలాంటి పట్టికలను రూపొందించ లేరు. ఇది చాలా శ్రమతో కూడుకున్న పని కూడా. ఐనా పుత్తా పుల్లారెడ్డిగారు చక్కగా వంశవృక్షపట్టికలు రూపొం దించి అనుబంధంలో చేర్చారు.




ఎందరో పండితులు సమష్టిగా చేయాల్సిన పనిని పుత్తా పుల్లారెడ్డిగారు ఒంటిగానే చేశారు. వీరి కృషి అభి నందించదగింది.

ఈ గ్రంథం ప్రతీ సాహితీవేత్త, ఆధ్యాత్మికవేత్తకు దిక్సూచివంటిది. అక్షరదోషాలు లేకుండా రచయిత చాలా శ్రద్ధ తీసుకున్న ఈ గ్రంథం తెలుగువారందరూ చదవ దగింది.

– డా॥ ఎన్.శ్రీమన్నారాయణ

# శ్రీమద్రామాయణ నామసర్వస్వం

రచయిత - పుత్తా పుల్లారెడ్డి,
పుటలు- 414, ఆకృతి- 1/8 డెమ్మీ ఆకృతి,
వెల- రూ.300/-,
ప్రతులకు - పుత్తా పుల్లారెడ్డి, ఇ.నెం.1-435-6-1,
మారుతీనగర్, కడప-516 001.
చరవాణి - 99592 41001

రామాయణ, భారత, భాగవతాలనే మూడు కావ్యాలు భారతీయసంస్కృతి నిక్షేపాలుగా జగత్ప్రసిద్ధి గాంచాయి. ఇవి కేవలం భారతీయభాషల్లోనే గాక విదేశీ భాషల్లోకి కూడా అనువదించబడ్డాయి. ఇవి సంస్కృత భారతికి అనర్ఘమణికిరీటాలవంటివి. ఇందులో రామా యణంలోని పాత్రల స్వరూపస్వభావాలు మనకు అవ గాహన కావాల్సి ఉంది. దీనికి సుగమమార్గం వేశారు పుత్తా పుల్లారెడ్డిగారు. వీరు "శ్రీమద్రామాయణనామ సర్వస్వం" అనే గ్రంథం వ్రాశారు. దీనికి 'జయలక్ష్మీయం' అని నామకరణం చేశారు.

ఈ గ్రంథంలో రచయిత రామా యణంలోని ప్రతి పేరు స్వరూపస్వభావాలను సమగ్రంగా వివరించారు. ఇప్పటివరకు మహా కావ్యాల్లోని అన్నిపాత్రలగురించి వివరించిన గ్రంథాలు ప్రత్యేకంగా మనకు లేవు. ఐతే, ఈ లోటును పుత్తా పుల్లారెడ్డిగారు తీర్చారు. కేవలం సంస్కృత రామా యణమందలి పాత్రలగురించేగాక తెలుగు రామాయణా లను కూడా పరిశీలించి వీరు ఈ గ్రంథాన్ని రూపొందిం చారు.

ఈ గ్రంథంలో మొత్తం 2360 సంజ్ఞానామము లను సంకలనం చేశారు. గ్రంథాంతంలో జనక, దశ రథుల వంశవృక్షాలు, కైకసి వంశవృక్షం, రామాయణ కథలో వర్ణింపబడిన వివిధ జీవుల విశేషాలు అను బంధంలో చేర్చబడ్డాయి.

అక్షరదోషాలు లేకుండా, ప్రతిమాట సరళశైలిలో ప్రయోగించబడింది. వ్యక్తిగతగ్రంథాలయంలో దాచదగ్గ గ్రంథమిది.

– డా॥ఎం.నరసింహులు

# డిసెంబరు, 2017 రాశిఫలాలు

బ్రహ్మశ్రీ తంగిరాల వేంకటకృష్ణపూర్ణప్రసాద సిద్ధాంతి,
తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి, రేలంగి



**మేషం**–స్వల్పఅనారోగ్యం కల్గుతుంది. ఆరోగ్యం కూడా అంతంతమాత్రంగానే ఉంటుంది. ధార్మికంగా, ఆధ్యాత్మికకార్యక్రమాల్లో పాల్గొంటారు. ఇతరుల అభిప్రాయాలను గౌరవిస్తారు. రాజకీయంగా గుర్తింపబడతారు. దూరప్రయాణాలు చేయాల్సొస్తుంది.



**వృషభం**–ఎప్పటినుంచో నిలచినపనులు ఫలవంతమౌతాయి. మిత్రుల తోడ్పాటుంటుంది. పదిమందిలో గుర్తింపు కల్గుతుంది. విందువిహారయాత్రల్లో పాల్గొంటారు. ఆలోచనవిధానం మెరుగౌతుంది. వ్యాయామపోటీల్లో సన్మానపత్రాలు, బహుమతులు గెలుచుకుంటారు.



**మిథునం**– ప్రతీవిషయంలోనూ ఏదో ఒక ప్రతిబంధకవాతావరణముంటుంది. ఐతే ఆధ్యాత్మికంగా ఎదుగుతారు. ఆకస్మికంగా ధనమొస్తుంది. వాహన ప్రమాదాలుంటాయి. జాగ్రత్త.



**కర్కాటకం**– తల, మెడ, నరాల, బలహీనత, నడుము సంబంధచికిత్స అవసరమౌతుంది. విద్యార్థులు కృషితో ఉత్తీర్ణత సాధిస్తారు. శ్రమపడి కార్యభారాన్ని సక్రమంగా నిర్వర్తిస్తారు. అందరికీ ప్రీతిపాత్రులౌతారు. ఆదర్శవంతమైనజీవనంతో మంచి పేరు తెచ్చుకుంటారు.



**సింహం**– పదిమందిలో ముందుంటారు. అందరికీ ఉపకారం చేస్తారు. సంతానం అభివృద్ధిలోకి వస్తుంది. చదువుల్లో రాణిస్తుంది. ఇతరదేశ ప్రయాణాలు కలిసొస్తాయి. గృహవాతావరణం అనుకూలం. నీచవ్యక్తులతో ప్రమాదముంటుంది.



**కన్య**– ధనవిషయంలో జాగ్రత్త వహించాలి. సమాజంలో గొప్పవారితో పరిచయబాంధవ్యాలు పెరుగుతాయి. కృషికి తగిన గుర్తింపు. సాంఘిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. ధనంఖర్చు, దేవతారాధనలు, పుణ్యక్షేత్రదర్శనాలుంటాయి. న్యాయసంబంధ విద్యలో విద్యార్థులు రాణించి తగిన గుర్తింపు పొందుతారు.



**తుల**–ధైర్యంగా ఉంటారు. కార్యసాధనకు మేధాశక్తినంతటినీ ఉపయోగించి సాధిస్తారు. అన్నింటా విజయం. తలచిన కార్యక్రమం పూర్తౌతుంది. ఆదాయం పెరుగుతుంది. విందువినోదాల్లో పాల్గొంటారు.



**వృశ్చికం**–వేళనతిక్రమించి భుజించటం, సాధుజనంతో, చుట్టాలతో విరోధాలు, కోపం, శరీర అనారోగ్యాలు కల్గుతాయి. ఇతరులచే నిందలను భరించాల్సొస్తుంది. సూర్యభగవానుని ఆరాధించటంవల్ల ఈ దోషాలనుండి బయటపడతారు. బంధుమిత్రుల శుభకార్యాల్లో పాల్గొని ఆనందం పొందుతారు.



**ధనుస్సు**– జన్మరాశిలో శని సంచారకాలంలో కొన్నిచిక్కులు ఒడిదుడుకులు తప్పవు. ఐతే గురుబలంవల్ల వ్యవహార ప్రతిబంధకాల్ని జయించి కార్యసాధన చేయగల్గుతారు. దూరప్రాంతప్రయాణాలు కలిసొస్తాయి. ధనసంపాదన బాగుంటుంది. విందువినోదాల్లో పాల్గొంటారు.



**మకరం**– క్రొత్తవ్యాపారాలు ప్రారంభిస్తారు. నూతనంగా భాగస్వామ్యవ్యాపారాలు కలిసొస్తాయి. సకాలంలో పనులు పూర్తి చేస్తారు. అధికారవృద్ధి కల్గుతుంది. ఏల్నాటి శనిప్రభావాన్ని అధిగమించడానికి ఆంజనేయ ధ్యానశ్లోకాలు పఠిస్తే మంచిది.



**కుంభం**– రాజకీయంగా ఎదుగుదల ఉంటుంది. గత మూడునెలలుగా ఉన్న గృహసంబంధ సమస్యలు తొలగి నిశ్చింతగా, ప్రశాంతంగా ఉంటారు. పోటీతత్త్వం పెరిగి తగినవిధంగా స్పందించి వ్యక్తిత్వాన్ని మెరుగు పరచుకుంటారు. నెలాఖరునాటికి విశేషమైన ధనసంపాదన కల్గుతుంది.



**మీనం**–బంధుమిత్రులకలయికతో ఆనందవాతావరణముంటుంది. శుభకార్యనిర్వహణ. బహుమతులు గెలుచుకుంటారు. నిలచినబాకీలు వసూలౌతాయి. ధనానికి లోటుండదు. వాహన ప్రమాదాలబారిన పడకుండా జాగ్రత్త వహించాలి. మృత్యుంజయ, రుద్రాభిషేకాలు చేయిస్తే మంచిది.



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)



## చందా నమోదు పత్రం

**1.** పేరు మరియు చిరునామా :

(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి & పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)

(పిన్‌కోడ్ తప్పని సరి)

సెల్ నెం.

**2.** కావలసిన భాష :

☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం

☐ హిందీ ☐ ఆంగ్లం ☐ సంస్కృతం (సంవత్సరచందా మాత్రమే)

**3.** సంవత్సర/జీవిత చందా :

☐ రూ.60/- ☐ రూ.500/-

**4.** చందా పునరుద్ధరణ :

(అ) చందా నెంబరు :

(ఆ) భాష :

**5.** చెల్లించిన మొత్తం :

డి.డి.నెం. :

తేది :

(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశం :

తేది :

చందాదారుని సంతకం

1) సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి. / ఎం.ఓ.ను 'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి' వారిపేరున తీయాలి.

2) సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గానీ లేక తెల్లకాగితంలోగానీ పైన పేర్కొన్నవిధంగా వివరాలు వ్రాసి, పంపవచ్చు. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. ప్రధానసంపాదకకార్యాలయం, తి.తి.దే., తిరుపతికి తప్ప-మీరు ఎవరిదగ్గర డబ్బులు కట్టి, మోసపోకండి.

3) మనిఆర్డరు పంపేవారు - అందులోనే మీచందావివరాలు వ్రాసి, ఈ క్రింది చిరునామాకు పంపాలి.

4) మా చిరునామా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి. ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507".

5) ఇతర వివరాలకు ఫోన్ నెం.0877-2233333, 2277777.




| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | | 3 | | 4 | | |
| 5 | | | | | | | | 6 |
| 7 | | | 8 | | | | 9 | |
| | | 10 | | | | 11 | | |
| | 12 | | | | 13 | | | |
| 14 | | | | 15 | | | | 16 |
| 17 | | | 18 | | | | 19 | |
| | | 20 | | | | 21 | | |
| | 22 | | | | | | | |

నిర్వహణ శ్రీ టి.ఎస్.జగన్మోహన్

### అడ్డం

1)రావణుని దుష్కృత్యము(7); 7)బలరాముడు(2); 8)హనుమతండ్రి(3); 9)శాంబరివిద్య(2); 12)బిందుమతిపతి(3); 13)ఒక సుప్రసిద్ధ సంగీతరాగం(3); 17)నాట్యం(2); 18)మహిళ(3); 19)భయస్థుడు(2); 22)భగీరథప్రయత్నఫలం(7)

### నిలువు

2)సౌరభం(2); 3)ఒక నాట్యభేదము(4); 4)నేర్పరి తలక్రిందులయింది(2); 5)బాకా(3); 6)నృత్తరత్నాకరం గ్రంథకర్త(3); 10)కౌరవమాత(3); 11)గౌతమపత్ని(3); 14)శివుడు(3); 15)మగని సేవించుసతి(4); 16)అరటి(3); 20)జట్కాబండి(2); 21)పల్లకి(2)

జవాబులు ఈ సంచికలోనే ఉన్నాయి. అన్వేషించి... సరిచూసుకోండి.

\- ప్రధాన సంపాదకుడు



Edited and published on behalf of T.T.Devasthanams by Dr. K.Radha Ramana, M.A., M.Phil., Ph.D., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by Dr.T.Ravi, M.A., Ph.D., P.R.O. & Dy. E.O.,(Publications & Press)FAC, T.T.D. Press, Tirupati - 517507.



ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం తరపున
బ్రహ్మోత్సవాలలో స్వామివారికి పట్టువస్త్రాలను సమర్పిస్తున్న
ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడుగారు



2018 సం॥ తి.తి.దే. నూతన క్యాలెండర్లు, డైరీలను
ఆవిష్కరిస్తున్న గౌ॥ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి



శ్రీవారికి సుమారు ఎనిమిది కోట్లరూపాయల విలువైన
బంగారుసహస్రనామ కాసులహారాన్ని
గౌ॥ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రివర్యుల సమక్షంలో సమర్పిస్తున్న
శ్రీ మంతెన రామలింగరాజు



గౌ॥ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రివర్యులకు
శ్రీవారి చిత్రపటాన్ని, ప్రసాదాల్ని అందచేస్తున్న
తి.తి.దే. కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు





తిరుమలలో బ్రహ్మోత్సవ ఏర్పాట్లను పరిశీలిస్తున్న
తి.తి.దే. శ్రీ కార్యనిర్వహణాధికారి, తిరుమల సంయుక్త కార్యనిర్వహణాధికారి.



SAPTHAGIRI (TELUGU) ILLUSTRATED MONTHLY Published by Tirumala Tirupati Devasthanams 25-10-2017
Regd. with the Registrar of Newspapers under "RNI" No.10742, Postal Regd.No.TRP/10 - 2015-2017
Licensed to post without prepayment No.PMGK/RNP-/DLGS/SAPTHAGIRI-Dt 18-12-2014



పంచమితీర్థం - చక్రస్నానం
శ్రీపద్మసరోవర పావనజలాల్లో...
పరవశించి మునకలేస్తున్న
భక్తజన సందోహం!

23-11-2017
చక్రస్నానం,
పంచమీతీర్థం